ప్రాకృత అకాడమీ ప్రచురణ - 1

# గాథాసప్తశతిలో తెలుగు పదాలు



తిరుమల రామచంద్ర

ప్రాకృత అకాడమీ

16 తుల్జాగూడ,

హైదరాబాదు-1

ప్రతులు: 1000

వెల :25 రూపాయలు.

ప్రాప్తిస్థానం : ప్రాకృత అకాడమీ

ముద్రణ :
వేంకట్రామ్ పేపర్ ప్రోడక్ట్సు (ప్రై) లిమిటెడ్,
నారాయణగూడ, హైదరాబాదు-29.

# కృతజ్ఞతలు

గురువర్యులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 1935 లో ఏదో ప్రసంగవశాత్తు "గాథాసప్తశతిలో చాల తెలుగు పదాలు ఉండే అవకాశం వుంది" అన్నారు. అప్పటినుంచి నేను, గాథాసప్తశతిని, తక్కిన ప్రాకృత కావ్యాలను అధ్యయనం చేస్తూ వివిధ విషయాలు సేకరించాను. ఆ సేకరణ ఫలితమే ఈ వ్యాసాలు.

నాది కేవలం సత్యాన్వేషణం. నేను చెప్పినదంతా ఒప్పుకోండనే నిర్బంధమేమీ లేదు. సత్యదృష్టితో పరిశీలించడానికి ప్రయత్నించాడు సుమా !-అని పాఠకులు భావిస్తే చాలు.

సహృదయులు మిత్రులు, ఆచార్య తూమాటి దొణప్పగారు అడిగినదే తడవుగా దీనికి 'ప్రాక్ కృతమ్'-ముందుమాట వ్రాసి యిచ్చారు. వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనాలు.

మిత్రులు, సుప్రసిద్ధ కళాకారులు, రచయితలు శ్రీ చంద్ర దీని ముఖపత్రాన్ని సాతవాహనులనాటి చిత్రంతో అలంకరించారు. వారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కారాలు.

ఈ పుస్తకాన్ని చారీ అండ్ కంపెనీ (సికిందరాబాద్) యజమానులు, మిత్రులు, సహృదయులు శ్రీమాన్ మామిడిపల్లి మురళీకృష్ణగారు ఉచితంగా ముద్రించి ఇచ్చారు. ఆంధ్రపత్రిక సంపాదకులు, మిత్రులు, సహృదయులు శ్రీ శివలెంక రాధాకృష్ణగారు ముద్రణ కయిన కాగితం ఖర్చును శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు, శ్రీ శివలెంక శంభుప్రసాదు ధర్మనిధినుంచి విరాళంగా ఇచ్చారు. వారిద్దరికీ కృతజ్ఞతాపూర్వక వందనాలు సమర్పిస్తున్నాను.

ఈ పుస్తకాన్ని "ప్రాకృత అకాడమీ" తొలి కుసుమంగా ప్రచురిస్తున్నందుకు, అకాడమీకి, దాని నిర్వాహకులకు కృతజ్ఞుణ్ని.

ఈ పుస్తకాన్ని నా కుమార్తె చిరంజీవిని సౌభాగ్యవతి నీరజ వివాహ సమయంలో (1978 మార్చి 26) వివాహోపాయనంగా ఆమెకు, నా జామాత చిరంజీవి శ్రీమాన్ సంపత్కుమార చక్రవర్తికి మంగళాశాసనాలతో అందజేశాను. ఆనాడు ఈ పుస్తకాన్ని ఆంధ్రప్రదేశ్ అమాత్యులు మిత్రులు, సహృదయులు శ్రీ తిరువరంగం హయగ్రీవాచార్యులుగారు ఆవిష్కరించారు. వారికి కృతజ్ఞతా పూర్వక వందనాలు సమర్పిస్తున్నాను.

ఈ వ్యాసాలన్నీ వివిధ పత్రికలలో ప్రచురితమైనవే. విషయ సూచికలో ఆ పత్రికల పేర్లు తెలిపినాను. ఆ పత్రికల సంపాదకులకు కృతజ్ఞుణ్ని.

5-9-22/97, ఆదర్శనగర్, హైదరాబాదు,
శాశయుక్తి శ్రావణ పూర్ణిమ.

భాషాసేవకుడు,
తిరుమల రామచంద్ర

# ప్రాక్కృతమ్

ప్రాకృతభాషా సాహితీసమారాధకులు హాలసాతవాహన చక్రవర్తి పుట్టిపోయిన పుణ్యభూమిలో ప్రాకృతభాషలమాట పట్టించుకునే పుణ్యాత్ములు లేకపోవడం వింతలలో వింత. గీర్వాణ భాషా రూపకాలు ముక్కాలు మువ్వీసంపాలు ప్రాకృతభాషామయాలు. కాని, ఛాయలతో సరిపుచ్చుకుంటారు సంస్కృతీయులు. అధ్యాపన సమయాలలో సయితం వారు ప్రాకృత భాషాభాగంవైపు తొంగి చూడరు. తెలుగు లాక్షణికులు విన్నకోట పెద్దన, కాకునూరి అప్పకవ్యాదులు విశ్రుతులు హేమచంద్ర త్రివిక్రమాది ప్రాకృతభాషా లాక్షణికులకు నమస్కారబాణం వేసి దూరంగా తప్పుకున్నారు. షడ్భాషా చంద్రికాకర్త చెరుకూరి లక్ష్మీధరుని కృషిని ఖరీదు గట్టిన తెలుగు షరాబు ఇందాకా కనిపించలేదు. మంచెళ్ళ వాసుదేవకవి కూర్చిన వైకృత చంద్రిక వెలుగులోకి వచ్చినా ఎవరూ దాని జోలికి పోలేదు.

కేతనాది ప్రాచీనాంధ్ర వైయాకరణులు తెలుగు శబ్దజాల వివరణంపట్ల ప్రాకృతాల ఊసెత్తలేదు. ప్రాకృతాల ప్రసక్తి తెచ్చిన చింతామణి చిన్నయ సూర్యాదులుకూడ తత్సమ పరిచ్ఛేదంలో ప్రాకృతసమరూపాలను పరామర్శించలేదు. తెలుగునందలి తద్భవాలలో సుమారు నూటికి పది మాత్రమే సంస్కృతభవాలు; నూటికి తొంభై ప్రాకృతభవాలు. వాస్తవస్థితి యిలా వుండగా సమీప మాతృక అయిన ప్రాకృతాన్ని పరిహరించి మూలమాతృక ఉంది కదా అని సంస్కృతంతోటే సరిపెట్టుకుంటున్నారు. ప్రతిదేయ

శబ్దాల విషయంలో సంప్రదాయవాదులు ఇలాగా అశాస్త్రీయమైన పద్ధతికి అంకురార్పణ చేయగా, మన పల్లెకూటాలలో, ఇనుకోలు బళ్ళలో ప్రకృతి-వికృతి రూపాలను వల్లెవేయించడంలో ఆద్య ప్రకృతికి పట్టం గట్టి, ద్వితీయ ప్రకృతిని విస్మరిస్తున్నారు. తవర, తాయం, తాయి, తావు, తీవి, తేవ-వంటి ప్రాకృతసమాలను అన్య దేశ్యాలని పరిభాషించిన పండితులూ, లాక్షణికులూ లేకపోలేదు. దక్షిణభారతంలోని అనేక ఉన్నత విద్యాసంస్థలలో ప్రాకృత భాషా ధ్యయనం అలవాటులేని ఔపాసనం. ఒకనాడు ఆంధ్ర విశ్వవిద్యాల యంలో తెలుగు ఎం. ఎ. విద్యార్థులయిన మేము ప్రాకృత రూపావ తారంతో, చండుని ప్రాకృత వ్యాకరణంతో కుస్తీ పట్టేవాళ్ళం. మా తర్వాత ఆ శాస్త్రభాగం పాఠ్యప్రణాళికనుంచి అదృశ్య మయింది.

ఇలా వుంది తెలుగు నేలలో ప్రాకృతభాషల స్థితి. అంటే అధీతి బోధాచరణ ప్రచారణాలలో ప్రాకృతభాషా సాహిత్యాలకు చెప్పుకోదగ్గ చోటు ఏర్పడలేదని తాత్పర్యం. ఇదేమని అడిగితే 'భాషాసు రమ్యా గైర్వాణీ', 'భాషాసు ముఖ్యా మధురా దివ్యా గీర్వాణ భారతీ' అని జవాబు రాకతప్పదు. ఈదృశమైన ఆలోచనా సరళి, ఆచరణ సరణి గడ్డకట్టుకుపోయిన తెలుగుగడ్డలో ప్రాకృత భాషలకు దిక్కూ మొక్కూ లేకపోయింది. అంతా యెత్తువారి చేతి బిడ్డలు. ఇది మన జాతి సత్త్వం; మానవజాతి తత్త్వం.

ప్రాకృతభాషల విషయంగా ఒకపాటి పరిశ్రమ చేసిన పెద్దలు తెలుగుదేశంలో వేళ్ళమీదికి చాలరు. వెనకటి తరంలో పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, మానవల్లి రామకృష్ణకవి, పరవస్తు వెంకట భట్టనాథస్వామి, చిలుకూరి నారాయణరావు, మేడేపల్లి వెంకట

రమణాచార్యులు ప్రభృతులు ఈ రంగంలో అంతో యింతో కృషి సల్పిన పండిత పరిశీలకులు. ఈనాటి తరంలో ప్రాకృత సాహిత్యపు సొగసులను తెలుగున వెలయించినవారిలో రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ, పుట్టపర్తి నారాయణాచార్యులు మున్నగు మహనీయులు పరిగణించదగ్గవారు. పైన పేర్కొన్నవారిలో సాహితీపిపాసువులు కొందరు; భాషాజిజ్ఞాసువులు కొందరు. సవ్యసాచిగా రెండింటా సై యనిపించుకున్న సరస సాహితీ సత్యవ్రతులు శ్రీ తిరుమల రామచంద్ర గారు. మానవల్లి, వేటూరి వంటి మహామహిమాత్ముల ఆచార్యకంలో సుశిక్షితులయిన విద్యావినోద దీక్షితులు వీరు. తెలుగుగడ్డలో అంత ర్ముఖులయిన ప్రాకృత భాషాపండితులు మరికొంద రుండవచ్చు. కాని, పైకివచ్చి, పరిశోధన రంగంలో పైకి వచ్చినవారు శ్రీ రామ చంద్రగారొక్కరే ఏకాంగి వీరులుగా, అసహాయ శూరులుగా కని పిస్తున్నారు.

తెలుగువారి వాగ్వ్యవహారంలో కన్నతల్లి తెలుగు; పెంపుడు తల్లి ప్రాకృతం. నాటికీ నేటికీ తెలుగుదేశంలో తెలుగంటే కనిపి స్తున్న ఆదరణ మనకు తెలిసిందే. కన్నతల్లికే కడగండ్లు తప్ప నప్పుడు పెంపుడుతల్లికి పిలిచి పీట వేసేవారెవరు? కన్నప్రేమకంటే పెంచినప్రేమ పెద్దదంటారు. పాత చుట్టరికాన్ని తవ్వి, అనురాగ వల్లరిని అల్లి, కొత్త చివుళ్ళను పల్లవింపజేసిన శ్రీ తిరుమల రామ చంద్రగారి కృషి అన్నివిధాలా అభినందించదగ్గది. వీరు పత్రికా రచ యితలే కాక పండిత పరిశోధకులు కూడ. అర్థావబోధ పర్యంత మయిన విద్యావ్యాసంగం వీరిది. సంస్కృతి పరిరక్షణంలో అనేక సాహితీ యుద్ధాలలో ఆరితేరిన వృద్ధమూర్తి. తెలుగుభూమి నేపథ్యంగా రూపెత్తిన 'గాథా సప్తశతి' లోని అందచందాలు, అతి

లోక రహస్యాలు వివిధకోణాలనుంచి దర్శించి యీ వ్యాసనంపుటిలో ప్రదర్శించారు. శాస్త్రవాసనకు దూరం కాకుండా, తెలుగు పలుకు బడి చెడకుండా తత్త్వావిష్కరణ కావించడంలో శ్రీ రామచంద్రగారు కృతకృత్యు లయ్యారని ధీరవిచారు లంగీకరించకపోరు.

ప్రొఫెసర్, తెలుగుశాఖాధ్యక్షులు,
నాగార్జున విశ్వవిద్యాలయం,
నాగార్జున నగర్.

తూమాటి దొణప్ప

IX

# మంగళాశాసనమ్

చిరంజీవిని, సౌభాగ్యవతి

నీ ర జ కు,

చిరంజీవి, శ్రీమాన్

సంపత్కుమార చక్రవర్తికి

మంగళాశాసనాలతో అందించిన

వివాహోపాయనం.

# విషయసూచిక

౧

# గాథా సప్తశతిలోని తెలుగు పదాలు

రాజకీయ ప్రాబల్యమూ, సాహిత్య ప్రాచుర్యమూ గల భాషలు ఇతర భాషలను, జాతులను లోబరచుకొంటాయి. పూర్వం మతానికీ, రాజకీయాలకూ అంతరం లేదుగనుక ప్రాచీనార్యభాషకు మాండలిక మాత్ర మైనప్పటికీ సంస్కృత భాష ఇతర భారతీయ భాషలను కొన్ని శతాబ్దాలవరకూ తల ఎత్తనివ్వలేదు. మతంతోపాటు వ్యాపించిన సంస్కృతం విభిన్న జాతులతో, సంఘాలతో సంబంధం ఏర్పడిన కొద్దీ వారి భాషల పదాలనూ, భావాలనూ ఆకళించుకొన్నది. డాక్టర్ గుండెర్ట్ పండితుడు అన్నట్టు ఆర్యభాషా పదాలను, సంప్రదాయాలను పంతరించుకొనకపోయివుంటే సంస్కృత సాహిత్యం ఇంత విశాలంగానూ, సమృద్ధంగానూ అయివుండేదే కాదు.[1] సంస్కృత ప్రత్యయాలతోను, ఉపసర్గలతోను ఇతర భాషా శబ్దాలు వేషం మార్చుకొని సంస్కృతంలో లీనమైనవనడానికి తంత్రవార్తికకారుడు కుమారిలభట్టు వాక్యాలే మనకు నిదర్శనం.

మీన, పీలు, కుంతల, హేరంబ, పలాండు, పున్నాగ, మరీచ, వ్రీహి, అటవీ, పుత్ర, మందిర, ఖర్జు, కశిపు, పుట్ట, శంకు, బలాకా, సూచనాదులయిన శబ్దాలు దక్షిణభారత భాషలనుంచి సంస్కృతంలో చేరినట్టు కిట్టెల్ పండితుడు తన కన్నడ నిఘంటువులో సోపపత్తికంగా నిరూపించాడు. "పున్నామ్నో నరకాత్ త్రాయత ఇతి పుత్రః" అనే వ్యుత్పత్తికంటే పుట్టు ధాతువునుంచి జనించిన పుట్ట శబ్దం 'పుత్ర'గా మారిందనడమే సహేతుకమేమో! మందిర శబ్దానికి మను, ఇరు పదాలే మూలమనడం సమంజసం. వెళ్+పక్క-

1. గుండెర్ట్ మలయాళం - ఇంగ్లీషు కోశ పీఠిక.

బలాకా అయివుంటుంది. ఏదో ఒక విధంగా వ్యుత్పత్తి కల్పిద్దామనే ఉద్దేశంతో సంస్కృత పండితులు శబ్దాల మూలరూపం గుర్తించ రానంత తప్పుదోవ పట్టించారు. కావి+ఏఱు—కావేఱు, కావేరి (ఎఱ్ఱని నీరు) అనే వ్యుత్పత్తి స్పష్టంగా కనిపిస్తూండగా, "కవేరస్య అపత్యం స్త్రీ" అని వ్యుత్పత్తి చెప్పడంలోనే సంస్కృత వ్యామోహం ఎంత ఉందో మనకు విస్పష్టం. గోద+ఏరే గోదావరి అయింది.

సంస్కృతం మాండలికంగా మాత్రమే వున్నప్పుడు సర్వ జనీనంగా అభివృద్ధిపొందిన ప్రాచీన భాష ప్రాకృతంకూడా ఇతర దేశ్యాలను తనవిగా చేసుకొనకపోలేదు. ప్రాకృత వైయాకరణులు, నిఘంటుకారులు దేశ్యాలపై ప్రాకృతముద్ర వేద్దామనే వ్యామోహం లేనందున వాటిని ప్రత్యేకంగా పేర్కొన్నారు.

ఆర్యావర్తంలోని మగధలో బుద్ధునికాలపు వ్యవహార భాష పాలీ. తన సిద్ధాంతాలను బుద్ధభగవానుడు ఆ భాషలోనే ఉపదేశిం చాడు. బుద్ధుని సందేశాలతో పాలీని మొట్టమొదట దక్షిణాపథానికి తెచ్చినవాడు అశోకుడు. దక్షిణాపథంలోనూ పాలీ భాషే వ్యవహా రింపబడేదనీ, ఇతర భాషలు లేవనీ, అశోకుడూ, ఖారవేల్లుడూ పాలీ భాషలో శాసనాలు వేయించడానికి ఇదే కారణమనీ చేసే వాదం సహేతుకం కాదు. పాలీ మతభాషగా గ్రహించడంవల్లనే (పూర్వం మతానికే ప్రాధాన్యం గనుక) అశోకుడు పాలీలో శాసనం వేయిం చాడు; ఖారవేల్లుడు తెలుగువాడైనప్పటికీ అంతే.

బృహత్కథలో ప్రాకృత, సంస్కృత, దేశీ భాషలు వున్నట్లు వేర్వేరుగా ఉల్లేఖించడమూ, క్రీస్తు మొదటి శతాబ్దానికి ముందున్న పాలీ శాసనాలలోకూడా తెనుగువాళ్ల పేర్లు లభించడమూ, చీనా యాత్రికుడు హుయెన్ త్సాంగ్ 7 వ శతాబ్దం ప్రారంభంలో కళింగానికి వచ్చినప్పుడు అక్కడి భాషలు వేరేనని తెలుపడమూ, దాక్షిణ్యాచిహ్న సూరి కుమారపాల చరితంలోని జాతివర్ణన, అన్నిటికంటే ముఖ్యంగా

కర్ణాటకదేశంలో లభ్యమౌతున్న ప్రాచీనశాసనాలూ దక్షిణాపథంలో పాలీగాని, సంస్కృతంగాని సామాన్య వ్యవహార భాషలుగా లేవన డానికి ప్రబల నిదర్శనం. శ్రీ సునీతికుమార చటర్జీ అన్నట్టు పాలీ భాషలో శాసనాలు వెలయించిన ఖారవేల్లుని పేరు తెనుగే (కాలు+ వేల్ = నల్లటి బల్లెం గలవాడు). జైన బౌద్ధ మతాల ద్వారా దక్షిణ భారత దేశంలో వ్యాపించిన ప్రాకృత భాషకూడా సంస్కృతంవలెనే దేశభాషల సంప్రదాయాలనూ, శబ్దజాలాన్ని లోబరచుకొన్నదని ఈవరకే అన్నాను. ప్రాకృతంలో మిళితమైపోయిన రోలంబ, రింఛోళి, తాలూరమున్నగు దేశిశబ్దాలను సంస్కృతమహాకవులుకూడా గతాను గతికంగా ప్రయోగించగా 'మేదినీ' మున్నగు నిఘంటుకారులు స్వీక రించి సంస్కృత ముద్ర వేశారు. "రోలంబ శబ్దం సంస్కృతేపి కేచి ద్గతానుగతికతయా ప్రయుంజతే" అని హేమచంద్రుడు దేశీ నామ మాల సప్తమసర్గ రెండవ ఆర్యవివృతిలో తెలిపాడు.

ప్రాకృతంలో చెప్పు, చెక్కు, చూచు మున్నగు తెనుగు క్రియలు చవఇ, చలఇ, చచ్ఛఇ, చజ్జఇ మున్నగు రూపాలతో చేరి పోయాయి. ఈ విధంగా గుర్తింపరానంత మార్పుతో అన్యదేశీ శబ్దాలు ప్రాకృత సాహిత్యంలో మిళితం కావడంవల్లనే ఆచార్య హేమచంద్రుడు దేశీ శబ్దాలకు అన్వయమే కుదరదనీ, అన్వయం కుదిరినా అర్థంకావడం కష్టమనీ దేశీనామమాల ప్రారంభంలోనే అన్నాడు. ("దేశీ దుస్సందర్భా, ప్రాయ స్సందర్భితాపి దుర్బోధా, ఆచార్య హేమచంద్రః త త్తాం సందృభతి విభజతిచ".) దేశీకి వ్యుత్పత్తి తెలియనందున ప్రాచీన సంప్రదాయసిద్ధమైన అర్థాన్నే గ్రహించాలని హేమచంద్రుడు నిర్దేశించాడు. దేశీ శబ్దాలు అర్థం కాక తప్పుడు వ్యాఖ్యలు చేసినవారినిచూచి హేమచంద్రుడు "ఇప్పటి దేశీకవులవి, వారి వ్యాఖ్యాతలవి ఎన్ని తప్పులని ఏరను?" (అధు నాతన దేశీకారాణాం, తద్వ్యాఖ్యాతౄణాంచ కియంత స్సమ్మోహాః పరిగణ్యంతే" అష్టమసర్గ, 12 వ అర్య.) అని ఎంతో కష్టపడ్డాడు. తాను 'సారతర దేశీదర్శనంతో' వ్రాస్తున్నానని, తన నిఘంటువులో

పొరపాట్లుండవని "తిణిసశబ్ద" వ్యాఖ్యాన సందర్భంలో స్పష్టపరిచాడు. ("తిణిసంచ వృక్షవిశేష మాచక్షతే, అస్మాభిస్తు సారతర దేశీదర్శనేన తిణిసశబ్దో మధుపటలార్థో వ్యాఖ్యాతః. తత్ర యుక్తాయుక్తస్య బహుదృశ్వానః ప్రమాణం" తృతీయసర్గ, 12 వ ఆర్య). సంస్కృత ప్రాకృత సాహిత్యాలలో యుగపురుషుడుగా వెలసిన హేమచంద్రునివంటివాడు భ్రాంతిపడటం పొసగదనుకుంటాను.

గాథాసప్తశతి తెనుగుగడ్డపై వెలసిన రచన. ప్రజా కవులు రచించిన ఈ అమరగాథలను సేకరించి ప్రాకృత సాహిత్య వధువుకు అందచందాలు సంతరించినవాడు హాలసాతవాహనుడు. హాలుని కాలం క్రీస్తుశకం 68 వ సంవత్సరమని విన్సెంట్ స్మిత్ నిర్ణయం. తెనుగు కవిరాజు సేకరించిన ఈ గాథలలో దేశీపదాలు, ముఖ్యంగా తెనుగుపదాలూ, సంప్రదాయమూ వెల్లివిరియక మానవుకదా! దీనిలో ప్రయోగించిన అత్త, తుప్ప, మఇల, మడహ, కిలించిఅ, పీలుఅ, ఎక్కల, పక్కల మున్నగునవి ప్రాకృత పదాలు కావనీ, కేవలం దేశ్యాలేననీ నిర్ధరించడానికి శ్రీ కులబాలదేవుడు మున్నగు వ్యాఖ్యాతలూ, పాదలిప్తాచార్యుడు మొదలు ఆచార్య హేమచంద్రుని వరకు గల ప్రాకృత వైయాకరణ నిఘంటుకారులూ ప్రమాణం. ఉచ్చారణ సాదృశ్యాన్ని, అర్థసామ్యాన్ని బట్టి వీనిలోని తెనుగు శబ్దాలను వింగడించడానికి ప్రయత్నిస్తాను.

1. అత్తా :

ఏత్థ ణిమజ్జఇ అత్తా
ఏత్థ అహం ఏత్థ పరిఅణో సఅలో,
పంథిఅ రత్తీఅంధఅ
మా మహ సఅణే ణిమజ్జిహిసి.

(7 వ శతకం, గాథ 67)

(ఆ. ఇచట నే బరుండు, నిచ్చట నత్తగా,
రిచట బరిజనంబు; లెఱిఁగికొనుము.

రాత్రి నీకు గానరాదు, నాశయ్యపై
తప్పిపడెద వేమొ ! దారికాడ !)[1]

తన అభిప్రాయాన్ని తెలుసుకున్న తెరువరిని ఉద్దేశించి ఒక జారిణి అన్న మాటలివి: "ఏత్థ ణిమజ్జఇ అత్తా" (ఇక్కడ అత్తగారు పడుకొంటుంది). ఈ పాదంలో 'సాసూ' శబ్దానికి మారుగా 'అత్తా' అనే పదాన్నే కవి ప్రయోగించాడు. 'అత్తా' అనే పదం సప్తశతిలో దాదాపు 12 సార్లు ప్రయుక్తమైంది. ఆ గాథల పాదాలు మాత్రమే ఉదాహరిస్తున్నాను: (1) అత్తా తహ రమణిజ్జం—1-8, (2) గ్రామణి ఘరమ్మి అత్తా—5-69, (3) మహామహఇ మలఅవాట, అత్తా వారేయి—5-97, (4) అత్తా ణ వాఇ మలఅగంధవహో—6-42, (5) అత్తా మత్తా పఈవి అణ్ణత్థో—6-49, (6) పంజరసారిం అత్తా—6-52, (7) చింతిజ్జంతో మణవల్లహో అత్తా—7-57, (8) వాహేణ రుఆవిఆ అత్తా—7-63, (9) ఏత్థ ణిమజ్జఇ అత్తా—7-67, (10) భణిఏ భణామి అత్తా—7-74. ఈ 'అత్తా' తెనుగు అత్తగారే ననడం స్పష్టం. ఛాయాకారులూ, వ్యాఖ్యాకారులూ దీనికి 'శ్వశ్రూః' అని అర్థంచెప్పడం మన ఊహకు సాధకం. మామ భార్యకు మామీ, మామి అనీ, మేనత్తకు పిఉచ్ఛా అనీ పలు గాథలలో ప్రయోగాలు కనబడుతున్నవి. తెలుగువారికి మాత్రం మేనత్త అయినా, అత్తగారయినా, మామ భార్య అయినా అత్తే. దీనికి కారణం తెనుగు, కన్నడ దేశాలలో వున్న మేనరికపు సంప్రదాయమే. అత్తాల్ అంటే తమిళంలో అమ్మ అని అర్థం. మాతృసమాన గనుక నే పిల్లను ఇచ్చిన ఆమెకూడా అత్తాశే. ఇది క్రమంగా అత్త అన్నంతవరకే మిగిలి వుంటుంది. అత్తై, అత్తె అని కాకుండా అత్తా అని దీర్ఘాంతంగానే గాథలలో వుండడంవల్ల ఈ పదాన్ని తెనుగునుంచే ప్రాకృత కవులు గ్రహించివుంటారు (దేశీనామ, 1-51)

---

1. రసవంతాలైన ఈ గాథలు పాఠకులకు తెలియడం కోసం శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి అనువాదం పొందుపరిచాను.

2. వాలుంకి :

సహి ఈరిసివ్వఇ గఈ
మా రువ్వసు తంసవలిఅముహాఅందం,
ఏఆణం బాలవాలుం
కి తంతుకుడిలాణ పేమ్మాణం,

(అలఅన్స, 1-10)

ప్రణయకలహంతో పెడమొగంపెట్టిన నాయికను ప్రణయాభిముఖునుగా చేయడానికి చెలికత్తె ఇలా అంటున్నది: "సఖి, ఎందుకలా పెడమొగంతో కన్నీళ్లు కుక్కుకుంటున్నావు? ప్రేమ వాలుంకి పిల్ల కాళ్ళవలె దగ్గర వున్నవారిని చుట్టుకుంటుంది. కొంచెం లాగితే వాటివలెనే ముక్కలు ముక్కలుగా విరిగిపోతుంది."

ప్రేమ చాలా సుకుమారమని తెలుపడానికి గ్రామీణులకు తఱచుగా తెలిసిన పిల్లవాలుంకి లేతకాళ్ళను అలఅకవి (బహుశా ఇతడు అల్లయ్య అయివుంటాడు) చక్కగా పోల్చి చెప్పాడు. తెనుగులో ఒల్లెంక, వాలుగ అనే రెండు శబ్దాలు మత్స్యభేదాలు తెలిపేవి వున్నవి. ఒల్లెంక=సన్నని కాళ్ళుగలిగి గోళాకారంగా వుండే చేప. దీని మాంసం విషం అని బ్రౌణ్యా నిఘంటువు తెలుపుతున్నది. శబ్దరత్నాకరంలో కూడా ఈ రెండు శబ్దాలూ వున్నవి. "తెలివాలుగల డాలు గల సోగకన్నులు" (శుకసప్తతి, ఆ. 1) "వాలముతాకునన్ గిరులు వజ్రనిపాతము సంస్మరింప బెన్ వాలుగలై" (పారి. ఆ. 3) ఒల్లెంక, వాలుగ రెండూ ఒక పేపదంనుండి పుట్టినవి అయివుంటాయి. ఒల్లెంకే క్రమంగా వాలుగ అయివుంటుంది. ప్రాకృత వాలుంకికీ, తెనుగు ఒల్లెంకకూ గల అర్థసామ్యాన్నిబట్టి, ఒకారోచ్చారణకూ, వాకారోచ్చారణకూ వ్యవహారంలోగల సన్నిహితత్వాన్నిబట్టి ఒల్లెంకే వాలుంకి అయి ప్రాకృతంలో చేరి వుంటుందని భావిస్తున్నాను. ఎండ్రకాయకూ, గోళాకారమైన ఈ చేపకూ గల సాదృశ్యంతో వ్యాఖ్యాతలు ఎండ్రకాయ అని భ్రమపడి వుంటారు. వాలుంకిని దోస

తీగ అని వ్యాఖ్యానించే పక్షంలో దోసతీగ లేతకొళ్లు లాగితే విరిగి పోతాయి.

3. పిలుఅ :

తడసంఠిఅ ణీడేక్కం
తపీలుఅ రక్ఖణేక్క దిణ్ణమణా,
అగణిఅ విణివాఅభయా
పూరేణ సమం వహఇ కాఈ.

(మాణస్స. 2-2)

(తే. కొమ్మకొనపయి గూటిలో గూరుచున్న
తనదు పిల్లల గాపాడు పనియె తలచి
మునిగిపోవుదు నను భీతి గొనక కాకి
వెడలెడిని గంటె చెట్టుపై వెల్లి వెంట.)

పీలుకః=శాబకః (పిల్ల) అని కులబాలదేవుని వ్యాఖ్య. సంస్కృతంలో ఈ శబ్దం "పీలతి స్తభ్నాతీతి పీలుకః=పిపీలకా, క్రిమిభేదః" అని అర్థాంతరంలో వున్నది. తెలుగులోని పిలుక శబ్దానికి పక్షి లోనగువాని పిల్ల అని అర్థం. పిళ్లై, పిళ్ళె, పిన్న మున్నగు తమిళ కర్ణాటక తెలుగు శబ్దాలు పిల్ల, పిలుక అనే తెనుగు పదానికి సమానార్థాలు. పిలుక శబ్దమే ప్రాకృతంలో చేరి, అక్కడినుంచి గతానుగతికంగా సంస్కృతంలో సూక్ష్మక్రిమి, పిపీలికా అనే అర్థంలో ప్రయుక్తమయింది. ప్రస్తుతం హిందీలో కుక్కపిల్లకు పిల్లా అనే వ్యవహారం కలదు.

4. పోట్టం :

పోట్టం భరంతి సఉణా
వి మాఉఆ అప్పణో అణువ్విగ్గా,
విహలుద్ధరణ సహావా
హువంతి జఇ కేవి సప్పురిసా.

(అలక్కస్స, 3-85)

పశులుకూడా ఏదోవిధంగా పొట్ట పోసుకుంటాయి. దుఃఖాల నుంచి దీనులను గట్టెక్కించే స్వభావం కల సత్పురుషులు కొందరే సుమా! అని ఈ గాథ అర్థం.

పొట్ట శబ్దం మరి రెండుచోట్లకూడా ప్రయుక్తమయింది. (1) థోక్కపఏఇ పోట్టంహ పక్ఖేఇ—2-71, (2) పోట్ట పడిపహి దుఃఖం—1-83.

"పోట్టం ఉదరం" అని వాఖ్య. దీనినే హేమచంద్రుడు దేశీ నామమాలలో ఉదాహరించాడు. సంస్కృత ప్రాకృత భాషలలో ఒకారం లేదుగనుక పొట్ట శబ్దమే పోట్టగా ప్రాకృతంలో గ్రహించి వుంటారు. పొట్ట శబ్దం తెనుగుకాదని, పృష్ఠం అనే సంస్కృత శబ్దం నుంచి పుట్టిందని అనడానికి ఎవరూ సాహసించ రనుకుంటాను. (దేశీనామ. 6-60)

5. కిలించిఅ:

ణ్హాణ హాలిద్దా భరిఅం
తరాఇఁ జాలాఇఁ జాలవలఅస్స,
సోహంతి కిలించిఅ కం
టఏణ కం కాహిసీ కఅత్థం ?

(మఅరందస్స, 1-80)

(తే. పసవునీళ్లాడి దువ్వెనపండ్లనడుమ
చిక్కుకొనియున్న మైలను చిన్నముల్లు
గ్రుచ్చి తీసెద వెవ్వని కోర్కి పండ
జేయుచున్నావు తెల్పవే చిన్నదాన ?)

ఈ గాథలోని కిలించిఅ శబ్దానికీ, పాఠాంతరంగా గ్రహించిన కిలిచ్చిఅ శబ్దానికీ సూక్ష్మం అని వ్యాఖ్యాతల నిర్వచనము. సన్నని,

నీచమైన అనే అర్థాలలో క్రించు, కించు శబ్దాలు తెనుగు సాహిత్యంలో లభిస్తున్నవి. "మగటిమిచెయె క్రించుపని కిట్లు" (భార. స్త్రీ. 2-96). తమిళ, కన్నడ భాషలలోని కిళి, కిళింజల్, కిళిచ్చల్, కీళ్ శబ్దాలకు సన్నని, సన్నగాచేయు, చించు అని అర్థం. కిలించిల శబ్దానికీ, కిళిచ్చల్, క్రించు, కించు శబ్దాలకూ గల సాదృశ్యాన్నిబట్టి కిలించిల తెనుగేనని నిశ్చయించడానికి అవకాశం కలదు దీనిని గతానుగతికంగా సంస్కృత పండితులూ ప్రయోగించడంవల్ల త్రికాండశేషకారుడు కిలింజకం, కిలింజం అని సంస్కృత ముద్ర వేసి సూక్ష్మదారువు అని వ్యాఖ్య చేశాడు. (దేశీనామ. 2-11)

6. అద్దాఏ :

పుట్టంతేణ వి హిఅఏ
ణ మామి ణివ్వంజ్జఏ తమ్మి,
అద్దాఏ పడిబింబం
వ్వ జమ్మి దుఃఖం ణసంకమఇ.

(రాఅవగ్గస్స, 3-4)

(ఆ. అద్దమంతు నీడ యంటున ట్లెవ్వని
యాత్మ నొరుల వగపు లంటుకొనవొ
యట్టివానితోడ నెట్లు సెప్పుదు నత్త,
మనసు వ్రక్కలైన మానె గాని.)

"అద్దాఏ—ఆదర్శే" అని వాఖ్య. దీనిని హేమచంద్రుడు దేశీనామమాలలో గ్రహించాడు. అద్దునది, ఎదుట ఉన్నదానిని తనలో అద్దుకొనునది గనుక అద్దము. అద్దము-అద్దబు-అద్దవు క్రమంగా అద్దాఓ అయింది. అర్థసామ్యాన్నిబట్టి ఆదర్శ శబ్దంనుంచే అద్దాఓ పుట్టిందనడానికి వీలులేదు. సమీకరణ ప్రక్రియ ప్రకారం తర్కయామి-తక్కేమి, నిర్బంధ-ణిబ్బంధ, మార్గ-మగ్గ, ప్రియదర్శి-పిఅదస్సీ అయినట్లు ఆదర్శ-ఆదస్సో కాగలదుకాని అద్దాఓ కాజాలదు.

దీనిని హేమచంద్రుడు దేశీనామమాలలో పఠించడాన్ని బట్టికూడా ఇది తెనుగు పదమే ననడం స్పష్టం. హిందీ, పంజాబీ, బెంగాలీలలో ఆదర్శ శబ్దం ఆరసీ అయింది.

7. భోండీ :

దట్ఠూణ రుందతుండ
గ్గ ణిగ్గఅం ణిఅసుఅస్స దాఢగ్గం,
భోండీ విణావి కజ్జే
ణ గామణిఅడే జవే చరఇ.

(విగ్గహాస్స, 5-2)

(ఆ. వెడదమూతితుదను వెడలిన వాడియా
కోఱపంటితోడి కొడుకుజూచి
తల్లిపంది తనకు నొల్లకున్నను మేయు
నూరిప్రక్కతోట నుండు యవలు.)

"భోండీ—సూకరీ" అని వ్యాఖ్యానం. దేశీనామమాల దీనిని ఖుండో అని ఉకారాదిగా గ్రహించింది. ఖుండీరో, బుండో అనేవి పర్యాయశబ్దాలు. ప్రాకృతంలో ఇ ఏ లకు, ఉ ఓ లకు పరస్పర వినిమయం సహజం కనుక భోండశబ్దాన్ని గ్రహించినట్లే. ఇది తెనుగు పందే ననడం నిస్సంశయం. సామాన్య వ్యవహారంలో అకారం ఒకారంగా మారుతుంది. మగడు-మొగడు, "మొగ డొచ్చి పిలచెను, పోయి వచ్చెద సామి." పంది పొంది అయి, త వర్గం ట వర్గంగా మారి, పొండి ఉచ్చారణలో ఊది పలకడానికి చేయవలసిన ప్రయత్నాన్నిబట్టి ఆదివర్ణం మహాప్రాణంగా పరిణమించి భోండి అయివుంటుంది. దీన్ని స్త్రీలింగంగా భావించినందున పుల్లింగ భోండ, ఖుండ శబ్దాలు కల్పించబడినవి. ఇది అప్పటమైన తెనుగు పదం అనడానికి దేశీనామమాల గ్రహించిన ఖుండీరో శబ్దం పరమ ప్రమాణం. ప్రాచీన తెనుగుపదం పంఱ్ఱి. ఇది ప్రస్తుతం తమిళంలో

పన్ని అయింది. శకటరేఫతోకూడిన నకారం ఉచ్చరించేటప్పుడు న్ద్రి అవుతుంది; న్డ్రి కూడా అవుతుంది. పన్ రెండు=పంద్రెండు. న్ద్రి ఉచ్చారణ మలయాళంలో మాత్రం నేడు మిగిలింది. పంద్రెండు మలయాళరూపం. తెనుగులో పన్ద్రి పంది అయిందికాని పన్ని కాలేదు. పన్ని నేడు తమిళవ్యవహారంలో వున్నది. మున్రు శబ్దానికి మాత్రం ముందు, మున్ను అనికూడా రూపాలు. పన్ద్రి అన్నప్పుడు చేయవలసిన ఉచ్చారణ ప్రయత్న విశేషాన్నిబట్టికూడా మొదటి అల్ప ప్రాణం మహాప్రాణమై వుంటుంది. భోండీతోపాటు ప్రాచీనశబ్దం భోండిరో కూడా ప్రాకృతంలో చేరింది. (దేశీనామ, 6-106.)

8. సరఅస్స :

ఆరుహాఇ జుణ్ణఅం ఖు
జ్జఅం వి జం ఉఅహ వల్లరీ తఉసీ,
ణీలుప్పల పరిమల వా
సిఅస్స సరహాస్స సో దోసో. (6-34)

ఉఅ మాణిణీ సరఅం. (6-50)

వయసు దిగజారినా చెఱకుకల్లు త్రావి మన్మథ వికారం పొందిన ఒక వనితను చూచి శరద్వర్ణనవ్యాజంతో హేళన చేస్తూ చెప్పిన గాథ యిది.

ప్రక్కన వున్నవాటిని చుట్టుకొనడమే స్వభావంగా గల దోస తీగ శరత్కాలం రాగానే పక్కన రాయివున్నా రప్పవున్నా, చెట్టు వున్నా మోడువున్నా అల్లుకుంటుంది. సారాయి తాగి కైపెక్కిన ఈ వయసు జారిన వనితకూడా ప్రక్కన వున్నవానిపై తూలుతుంది. నీలోత్పల పరిమళంగల సరకపు దోషమేసుమా ఇది. సరక అన్నప్పుడు శరత్కాలము, చెఱకు సారాయి అని శ్లేష.

సరఅ శబ్దం శరత్కాలం అనే అర్థంలో తద్భవమే. ఇడు మద్యం అనే అర్థంలో వ్యుత్పత్తి లేదు. ఇది తెనుగు చెఱకే కాని

మరేమీ కాదు. తమిళ కన్నడాలలో చెఱకుకు సమానార్థకంగా కఱుంబు, కబ్బు పదాలు వ్యవహృతాలు. కఱచి తినేదికనుక కఱుంబు, కబ్బు, చెఱకు అయివుంటుంది. తర్వాత చెఱకునుంచి పుట్టిన మద్యానికి లాక్షణికంగా వ్యవహారం కలిగివుంటుంది. ("ప్రాప్తాయాం నిశి పప్రచ్ఛ నిజం పరిజనంచ సః, కి మద్య రాత్రి పర్యాప్త మస్తి న స్సరకం నవా?" కథా సరిత్సాగరం, 54-99) సరక శబ్దాన్ని క్రమంగా మధుపానానికీ, మధుపాత్రకూ కూడా వ్యవహరించారు. తర్వాత సంస్కృత కోశకారులు దీనిని గ్రంథస్థం చేశారు. "సరకోఽస్త్రీ శీధుపానే శీధుపాత్రేఽశుశీధునోః"—మేదినీ. "కఱకంఠు సేయవిల్లగు చెఱకుం జెఱుకైన వంటచెఱకుం జెఱకే" (ఉత్తర హరివంశం, ఆ. 6.) అని ప్రాచీన ప్రయోగాలలో ఎకారాదిగానే చెఱకు శబ్దం ఉన్నా, దీని ప్రాచీనరూపం అకారాదిగా చఱకు అనే వుంటుంది. కఱుంబు, కబ్బు అని తమిళ కర్ణాటక భాషలలో రూపాలు వుండడం ఈ ఊహకు సాధకం. గడ్డ-గెడ్డ, గంతు-గెంతు వలెనే చఱకుకూడా చెఱకు అయివుంటుంది.

## 9. తుప్ప :

తుప్పాణణా కిణో చి
ట్ఠసి త్తి పడిపుచ్ఛిఆఎ బహుఆప,
విఉణావేట్ఠిఅ జహణ
త్థలాఇ లజ్జోణఆం హాసిఅం.

(అలకరసస్స, 3-89)

వణ్ణఘిఅ తుప్ప ముహిఎ (వంగవిలరస్స, 1-22)

తుప్ప శబ్ద విచారానికి ముందు పై గాథ అర్థాన్ని కొంత వివరిస్తాము : "ముఖానికి నెయ్యి పూసుకొని ఎందుకు నిలుచున్నావు?" అని అడుగగా, కోడలు సిగ్గుపడి చీరను మరొకమారు ఒంటిచుట్టూ చుట్టుకొని నవ్వింది. చెరగు మూసిందని భావం. ఆ కాలంలో రజ

స్వలలు గుర్తుగా మొగానికి వన్నెకలిపిన నేయి పూసికొనడం దేశాచారమని 1-22వ గాథావ్యాఖ్యానంలో వివరించబడింది. ఈ ఆచారం నేటికీ కర్ణాటక దేశంలోను, రాయలసీమలో కొన్ని ప్రాంతాలలోను లాంఛనప్రాయంగా వున్నది. ప్రథమరజస్వలకు 16 నాళ్ళ (పండుగ) వరకు నూనెపసపుకాని, నేయిపసపుకాని రాయడం కలదు. రజోదోషం కలుగకుండా ప్రథమ రజస్వల ఆరోగ్యాన్ని రక్షించడంకోసం జరిపే వైద్యశాస్త్రప్రక్రియ ఇది. రజోగంధంనుంచి విషక్రిములు ఆకర్షింపబడకుండా తొలగిపోవడంకూడా ఈ పసపునేయిపూత ఉద్దేశమట. 2000 ఏండ్లనాటి ఈ ఆచారం లాంఛనప్రాయంగా మాత్రమే నేడు నిలిచింది.

పైన ఉదాహరించిన రెండవ గాథ చరణంలోని 'వణ్ణఘిఅ తుప్ప' శబ్దానికి 'హరిద్రాదివర్ణ ప్రధానం ఘృతం' అని వ్యాఖ్యానం.

ఈ గాథలలో ప్రయోగించిన తుప్ప శబ్దం నెయ్యికి ప్రాచీన తెలుగు పర్యాయపదం; నన్నయకాలానికే వ్యవహారచ్యుత మైనది. తుఱువు-ఆవు నుంచి వచ్చింది గనుక తుఱుప్పు-త్రుప్పు-తుప్పు-తుప్ప అయింది. ఆవునేయి అన్నమాట. తుఱుపు శబ్దం రాష్ట్రకూట ధ్రువరాజు శాసనం (క్రీ. శ. 790) లో ప్రయోగింపబడింది. తమిళంలో ఆలమందకు తొఱువు అనే ప్రయోగం వుందనీ, పై ధ్రువరాజు శాసనంలోని తుఱుపు శబ్దానికీ, తొఱువుకూ మూలరూపం తొఱు అయివుంటుందనీ ఎపిగ్రాపియా ఇండికాలో చర్చించబడింది. తొఱ్ఱుపట్టు=గోష్ఠము "ఘనభుజుండు నరుడు దన తొఱ్ఱుపట్టుల విశ్రమించి"—(భారతం, అది. 8-210) "బుష్యాశ్రంగు దొఱ్ఱుపట్ల విశ్రమించుచు"—(భారతం, అరణ్యా. 3-118) తొఱ్ఱులు=ధేనువులు. "తొఱ్ఱులు గాచిన నందుని"— (భాగవతం, 10 పూర్వ. 633), త్రువ్వు-ఎద్దు, ఆవు. "త్రువ్వట బాబా, తలపై పువ్వట." తువ్వాయి దూడకు వ్యవహారం. త్రువ్వు, తుఱువులకు సంబంధించిన వస్తువులన్నీకూడా లాక్షణికంగా తుఱువు అయివుంటాయి. తుఱువు తుప్ప

ఆయిన క్రమాన్ని మొదటే నిరూపించాను, "తుప్పో స్నిగ్ధః" అని హేమచంద్రుడు దేశీనామమాలలో పఠించాడు. (5-22)

10. ఫలహీ :

ఫలహీ వాహణపుణ్ణా
హ మంగలం లంగలే కుణంతీఏ,
అసతీఅ మణోరహా గ
బ్భిణీఅ హత్థా ధరధరంతి.

(కహిలస్స, 2-65)

(ఆ. ప త్తిచేను దున్నవలసి మంచిదినాన
మడక పూజ చేయదొడగినపుడు
కోర్కు లాత్మ గుబులుకొన గడగడమని
వడకదొడగె గాపు చెడిపె కేలు.)

ఫలహీశబ్దం మరి మూడు చోట్లకూడా ప్రయుక్తమైంది. (1) ఫలహీ వేంటేసు ఉఅహా బహులఆఏ 4-59, (2) హాసిఅంఅ ఫలహీఏ—4-60, (3) ఫలిహాం అ మోడిహాం మహిసవణ—6-49. "ఫలహీ=కార్పాసవృతః" అని దేశీవ్యవహారమని కులబాలదేవుని వ్యాఖ్య. ఫలహీ అని హేమచంద్రుడు దేశీనామమాలలో పఠించి వలహీ, వవణీ అని పర్యాయపదాలు పేర్కొన్నాడు. తెనుగు ప్రత్తే ఫలహీగా మారింది. ప్రత్తికి ఆదిరూపమైన పఙుత్తి పలుత్తి అయి, అంత్యద్విత్వాతుక్షరాన్ని ఊది పలుకడంవల్ల క్రమంగా పలుత్తీ-పలహీ అయివుంటుంది. "పత్త్రికా శబ్దంనుంచి పత్తి అయివుంటుంది. ప్రపత్త్రికా శబ్దంనుంచి ప్రత్తి పుట్టివుంటుంది" అనే వాదం సహేతుకం కాదు. పత్త్రికా నుంచి పత్తియ-పత్తి కావడానికి వీలున్నా అర్థం కోసం లాక్షణికంగా నానాబాధలు పడవలసివుంటుంది ప్రపత్త్రికా శబ్దంనుంచి ప్రత్తి అనే రూపం అసలే కాదు. తెనుగు సంప్రదాయానికి ఉపసర్గవిధానమే విరుద్ధం. 'పత్త్రికా' నుంచి 'పత్తిఆ' కావచ్చును

కాని 'ఫలహీ'ని ఏ విధంగానూ సాధించలేము. ఛిద్రవాచక ఛిల్ల, ఉచ్ఛిల్ల శబ్దాలు రెండూ వేర్వేరనీ, ఉచ్ఛిల్లశబ్దం ఉత్పూర్వక ఛిల్ల శబ్దం కాదనీ, దేశీశబ్దాలకు ఉపసర్గసంబంధం ఉండదనీ హేమచంద్రుడు దేశీనామమాల ప్రథమసర్గ 95వ ఆర్యావ్యాఖ్యలో వివరించాడు. ("నహి దేశీశబ్దానాం ఉపవర్గసంబంధో భవతి.")

11. వేంట :

అజ్జం మోహాణ సుహిఅం
ముఅత్తు మోత్తూ పలాఇప హాలీప,
దరఫుడిఅ వేంటభారో
ణఆఇ హసిఅంఅ ఫలహీ ఏ.

(జణ్ణందసారస్స. 4-60)

(ఆ. చొక్కి కనులుమూయు సుదతి జచ్చె నటంచు
విడిచి పాఱు కాపువెడగు చూచి
పత్తికొమ్మ సగము పగిలిన కాయల
మొగము వంచి చేల నగియబోలె.)

మరి రెండు చోట్లకూడా వేంట శబ్దం ప్రయుక్తం. (1) ఫలహీ వేంటేసు ఉఅహ వహుఆప—4-59, (2) తాలవేంటజుఅం—4-98.

"వేంటో కార్పాసఫలం" అని దేశీవ్యవహార మున్నట్లు కుల బాలదేవుని వ్యాఖ్య. ప్రత్తివిళ్లు, ప్రత్తివెంట్లు అన్నమాట. ఉరుళ్ ధాతువుమూలంగా గల ఉరుండై, ఉండ, ఉంట క్రమంగా వెంటు, వెంటి అయింది. గడ్డివెంటు=గడ్డిచుట్ట. ప్రత్తివెంటు=పత్తిచుట్ట-పత్తివుండ-పత్తికాయ. "కచ్చడం బాడిగా గల చీరలెల్ల, చెచ్చెర వెంట్లుగా జేసి ముట్టించి" (బసవపురాణం, దివకళియార్ కథ, పుట 75), "కోకలు వెంట్లుగా బెనచి" (శివధర్మాలు, ఆ. 1) ఉండ,

ఉంట, వెంటి అని క్రమపరిణామం స్పష్టంగా గోచరిస్తుండగా వర్తుల, వృత్త శబ్దాలనుంచి వ్యుత్పత్తి సాధించవలసిన అవసరం ఏమిటి? ప్రాకృతం ద్వారా వెళ్ళిన తెనుగు వెంటు శబ్దాన్ని వంతః=ఖండః, భాగః అని సంస్కృతీకరించి పండితులు గ్రహించారు.

ఉంట శబ్దం ఒంటుగా కూడా మారింది. ఒంట్లు=పోగులు. 'పచ్చరాయొంటువాని'-ప్రయోగం. తాలవేంట యుగం=తాళ పత్ర తాటంకం అని వ్యాఖ్య. చెవాకు అన్న మాట. చుట్ట అనే అర్థం కల ఒంటు శబ్దం వేంట రూపంతో తాళపత్రంతోపాటు చెవి ఎక్కి తాళాన్ని తోసివేసి పోగు, కుండలం అయికూచుంది.

12. రుంప-రంప :

ఉక్ఖిప్పఇ మండలి మా
రుఏణ గేహంగణాహి వాహీఏ,
సోహగ్గధ అవడా అ
వ్వ ఉఅహ ధణురుంపరింఛోలీ.

(హాలస. 2-20)

(ఆ. చెంచుమగువ ఇంటిచెంగటఁ జెక్కిన
మగని పెద్దవింట దెగిన చిలుగు
పొట్టు మింటి కెగిరిపోయెడు సుడిగాలి
దాని భాగ్యగుణపతాక యనగ.)

మరొక ప్రయోగం :

సోహగ్గం ధణురుంప
చ్ఛలేణ రచ్ఛాసు వికిరఇ. (హాలస. 2-19)

రుంప శబ్దానికి రంప అని పాఠాంతరం. రుంప, రంప=తష్టత్వక్ (చెక్కిన పొట్టు) అని వ్యాఖ్యాత వివరిస్తున్నాడు. అంపపు పొట్టు అని అర్థం. అంపం పాత తెనుగు ఆయుధాలలో ఒకటి.

రంపె=తోలు కోసెడి సాధనం (శబ్దర). రంపఇ=తక్ష్ణాతి (చెక్కుతున్నాడు) అని ధాత్వాదేశంగా విధించినట్లు హేమచంద్రుడు (శబ్దానుశాసనంలో) పేర్కొన్నాడు. అంపు=ఊయిడిపెట్టు, అంపులాడు=ఎప్పుడూ పీకులాడేవాడు. అంపుధాతువు మొదట చెక్కడానికి కూడా ప్రయోగింపబడేదేమో! తర్వాత కోయడానికి వ్యవహరింపబడి వుంటుంది. ఆచార్య హేమచంద్రుని మాటలనుబట్టి ఇది దేశి. మనకు తెనుగు.

13. సిప్పర :

ఖరసిప్పర ఉల్లిహిఆఇఁ-

(పసణ్ణస్స, 4-30)

సిప్పరఉల్లిహిఆఇఁ=పలాలోల్లిఖతాని (గడ్డితో తుడిచివేస్తున్న) అని వ్యాఖ్య. సిప్పర శబ్దం తృణవాచకంగా దేశీనామమాలలో పఠితం. "పచ్చని కంబలి గవిసికొన్న విధమున బొలుపుగ చిప్పరలు గవిసె భూతలమెల్లన్." (నన్నె. కుమార. 6-757) చిప్పర – సన్నని గడ్డి. చిర్+పుల్ క్రమంగా చిర్పుల్-చిప్పర అయింది. ప్రాకృతంలో తృణసామాన్యవాచిగా గ్రహించబడింది. తెనుగులో క్రమంగా పెద్దదై ప్రస్తుతం చీపురై మూలబడింది.

14. తాలూర :

తాలూరభమాఉల ఖుడి
ఆకేసరో గిరిణఈప పూరేణ.

(అవటంకస్స 1-37)

(తే. కొండసెలపటి సుడికి జిక్కుకొని కలఁగి
తిరుగుచును గేసరంబులు విఱిగిపోవ
కొంత మునుగుచు దేలుచు గొదమతేటి
వెంటనంట కడిమిపువ్వు వెల్లబోయె.)

"తాలూరో=జలావర్త ఇతి దేశీ" అని వ్యాఖ్య. తలయతి తలం దర్శయతీతి తాలూరః-అని శబ్దకల్పద్రుమ వ్యుత్పత్తి. తాలూరశబ్దం దేశీ అని వ్యాఖ్యాత అంటున్నాడు. దేశీనామమాల ఫేనపరంగాను, ఆవర్తపరంగాను ఈ శబ్దాన్ని గ్రహించింది. ఇది తెనుగుశబ్ద మవడానికి చాల ఉపపత్తి కలదు. తిర్, తిప్పు, తిరుగు, తలారు అనునవి తెనుగులో భ్రమివాచికాలు. తలారు శబ్దానికి మరలు, తిరుగు అని అర్థము. తలారుకూ, తాలూరకూ సంబంధం వున్నట్లు తోస్తున్నది. తాలు శబ్దానికి తిరుగు, తాలించు, తాలబోయు అనే అర్థాలు కలవు. "క్రేపులందలచి తలారింపక" (భాగవతం, స్కం. 10) తలారే తాలూర శబ్దానికి మూలం అయివుంటుంది (దేశీ, 5-21.)

15. మడహాసరిఆ:

ఓ హిఅఅ మడహాసరిఆ
జలరఅహీరంత దీహదారువ్వ,
ఠాణేఠాణే వ్విఅ ల
గ్గమాణ కేణావి ణజ్ఝిహసి.

(మహోపవస్స, 2-5)

(ఆ. చిన్నవాగువడికి జిక్కి కొట్టుకపోవు
పొడుగుకట్టెవోలె నడుమనడుమ
దగులుకొనెదు మనస, తప్పక యెవ్వరో
కడకు నిన్ను బట్టి కాల్చివైచు.)

"మడహాశబ్ద స్స్వల్పవాచకః" అని వ్యాఖ్య. దేశీనామమాలలోను, సంస్కృత నిఘంటువులలోను ఇది లభించడంలేదు. అడఁగు, మడఁగు, అణఁగు, మణఁగు శబ్దాలకు "తగ్గియుండు" అని అర్థం. మడుము=నిలిచిపోవుట, మదకు=నక్కుట అని బ్రౌన్యా నిఘంటువు. "అప్పుడు తొలఁగి యొయ్యన నడుగిడుచు మదకుచు దీపముల్ మరుగు వెట్టుచును"—బ్రౌన్ ఉదాహరణ. మదకుచు అనగా మెల్లిగా

వెళ్ళుచు అని అర్థం. మడహాసరిఆ=మెల్లిగా ప్రవహించే నది. మడవ అన్నమాట. నీళ్ళు తగ్గివున్నప్పుడే నదీప్రవాహ వేగం మందగించి వుంటుంది. మడ=ప్రణాహ మార్గము (కాలువ) (శబ్దరత్నా.) "మడలు దరులు వాఁకలును గ్రమంబుగ నొకడున్" (హరివంశం, పూ. ఆ. 8.) "మడల తీరంబుల మడుగుల మేటి, పడియల" (నవనాథ చరిత్ర, భా. 3.) మదకు, లేక మడుగువల్ల పుట్టిన మడవ శబ్దమే మడహ అయింది.

16. ఓ:

ఓ హిఆఅ ఓహిదిఅహం (5-37)

ఓ హిఅత్త మడహాసరిఆ (2-5)

ఓ హిఆఅ అన్నప్పుడు హే అనే సంబోధన ప్రథమావిభక్తికి మారుగా ఓ అనే తెనుగువిభక్తి ప్రత్యయం ప్రయుక్తమైంది. ఓ, ఓయి అనేవి ప్రాచీన తెనుగు సంబోధన ప్రథమావిభక్తి ప్రత్యయాలు. నన్నయ భట్టారకుడు సంస్కృతాభిమానంకొద్దీ తెనుగు సంబోధన ప్రత్యయాలను వాడక సంస్కృత సంబోధన ప్రత్యయాలనే వాడినాడు. నన్నయ ఆంధ్రశబ్దచింతామణిని మొదట సూత్రించి దానికి లక్ష్యంగా భారతాన్ని రచించాడని వాదిస్తున్న పెద్దలు "ఓ ఇ త్యామంత్రణే తు వికృతౌ స్యాత్" అనే సూత్రానికి నన్నయ భారతంలో లక్ష్యం లేనందుకు కారణం చెప్పవలసి వుంది.

17. వోడ సుణఓ:

వోడసుణఓ విఅణ్ణో
అత్తా మత్తా పఈవి అణ్ణత్థో,
ఫలిహం వ మోడిఅం మహి
సపణ కో తస్స సాహేఉ. (6-49)

(ఆ. అత్త పడిన దింట మత్తెక్కి, పతి పోరు
గూరి కేగె, కుక్క దోరిపోయె,
ప్రత్తిచేను విఱుగబడ మేసె నెనుబోతు
దీని నతని కెవరు దెలుపువారు ?)

"వోడో దుష్టః, ఛిన్నకర్ణోవా" అని వ్యాఖ్య. ఛిన్నకర్ణ మనగా అవిటు అని మనం గ్రహిస్తే గాథలోని అర్థం మరింత రస వంతంగా వుండగలదు. "మొదలే అవిటు కుక్క, అదికూడా ఇప్పుడు జబ్బు పడ్డది" అని సంగతంగా వుంటుంది. ఓడు, ఓట=బీటలువారి నది "ఉద్దవిడిని నేల నోడుగా వైచి"— (ప్రభులింగలీల, 2-45) ఓటికుండ, ఓటినోరు అని వ్యవహారం. ఏవిధంగా చూచినా ఇది అవిటో, ఓడో—తెనుగుపదమే.

18. సాఉలీ :

సుఅణు వఅణం ఛిఅంతం
సూరం మా సాఉలీఅ వారేఙ.

(ణీలస్స, 3-69)

(ఆ. తరుణి, నీమొగంబు దాకెడు సూర్యుని
చెఱగుపెట్టి యడ్డుసేయవద్దు.)

వాఉవ్వేలిఅ సాఉలీ—(7-5)

సాకులీ అని దీనికి పాఠాంతరంకూడా. "సాకులీ=వస్త్రాంచల వాచకో దేశీ" అని వ్యాఖ్యానం. "సాఉలీ=వల్లవికా" అని కుల బాలదేవుని టీక. సాహులీ శబ్దాన్ని వస్త్రపర్యాయంగా దేశీనామా వళి గ్రహించింది. చెఱగు=కప్పుకొనే వస్త్రం అని అర్థం. తెనుగు సాలువే వర్ణవ్యత్యయంతో సాఉలి అయింది. "పొసగ గటివస్నె సాలువ ముసుగుపెట్టి" అని సాలువకు ఉదాహరణం. శశాంక.ఆ. 4.) (దేశీనామ. 8-52)

19. మఇల :

(1) గిహ్మే దవగ్గి మసిమఇలాఇం (1-70)
(2) మదమఇలీకఅ కరంజ సాహాహిం (2-21)
(3) దీఆటవ్వ అఇరేణ మఇలేఇ (2-35)
(4) పఇవ్వప ణ తుహా మఇలిఅం గోత్తం (5-17)
(5) ధూమ మఇలో వి పంకంకిఓవి (6-26)
(6) పంక మఇలేణ ఛీరేక్కపాఇణా (6-67)
(7) ణివడంత బాహా మఇలేణ (1-34)

మఇల=మలిన అని వ్యాఖ్య. ఇది సంస్కృత మలిన శబ్దంతో అన్నిటా సదృశంగా కనిపిస్తున్నా స్వతంత్రశబ్దం. మకిల, మంకు, మంగు, మణుకు మున్నగునవి మఇలకు సమానార్థకమైన తెలుగు పదాలు. "మకిలన్ ఛాపకుంబాప"—వడ్డాదివారి ప్రయోగం. మఇల జుత్తి=రజస్వలా, మఇలో=గతతేజాః అని హేమచంద్రుడు దేశీనామ మాలలో గ్రహించడంవల్ల దీనిని మనం తెనుగుగానే గ్రహిద్దాము.

20. పాణఉడీ :

పాణఉడీ అవి జలిఊణ. (హాలస్స. 3-27)

"పాణఉడీ=చండాలకుటీ" అని వ్యాఖ్య. "పాణో శ్వపచః" అని దేశీనామమాల. పాణశబ్దం పొలసు (హొలసు!) నుంచి జనించినది. మధ్యలకారం నకారంగా మారి పొనసు, పొణసు, పాణసి అయింది. "పాణసి పువ్వుబోడులము" (హరిశ్చంద్ర. ఆ. 2.) "పాణసివారము" (శివరాత్రి. 3-58) అని ప్రాచీన ప్రయోగాలు. అంత్య సకారం క్రమంగా భ్రష్టమై పాణమాత్రం మిగిలింది. (దేశీనామ. 6-38)

21. తీరవి :

కేలీఅ వి రూసేఉం
ణ తీరవి తమ్మి చుక్కవిణఅమ్మి.
జా ఇఅవహి న మావ
ఇమేహిఁ అవసేహిఁ అంగేహిం.

(ప్రావచీఖలస్స, 2-75)

(అ. ఎరవుతెచ్చుకొన్న తెఱగున వసము గా
కుండ జెడిన యట్టి యొడలు గలిగి
అమ్మ! తప్పు లెన్ని యతడు చేసిన నెట్లు
అలుగనేర్తు నవ్వులాటకైన ?)

ఉస్ససిఉంపి ణ తీరఇ
కింఉణ గంతుం హాఅథణేహిం.

(కఇరాఅస్స, 3-58)

ఈ పాడు స్తనాలతో ఊపిరి విడువడానికే తీరదు. ఇక వెళ్ళడం కూడానా ?

అణ్ణహా ణ తీరఇ (4-49)

"ణ తీరవి=నశక్యతే" అని వ్యాఖ్య. తీఱదు అని అర్థం. రూపాన్నిబట్టీ, అర్థాన్నిబట్టీ ఇది తెనుగుపదమే. "ఇయ్యెడ దడవుగా నిలువదీఱదు" (భారతం. ఉద్యోగ. 1-42)

22. కుసుంభ :

కుసుంభ శబ్దాన్ని పుష్పవాచకంగానూ, వర్ణవాచకంగానూ, వృక్షవాచకంగానూ పలుగాథలలో ప్రయోగించారు. కోసంభ కిసలఅ వణ్ణఅ (1-19), లగ్గం కుసుంభపుప్ఫం త్తి (2-45), కుసుంభ తుప్ఫా ప్పసాఏణ (4-12), కుసుమవెట్టిన వస్త్రం అనే అర్థంలో మలణే కుసుంభరంజిఅ కంచుఅహారణ (6-45) అని ప్రయోగం.

కుః పృథివీ శోభత ఇతి కుసుంభః అని సంస్కృత పండితులు చెప్పే వ్యుత్పత్తి. (భూమికి అందమైన పూలు గల ఏ చెట్టయినా అలంకారంగానే వుంటుందిగనుక) సమంజసంగా కనిపించదు. "కటుర్విపాకే కటుకః కఫఘ్నో, విదాహీ భావా దహితః కుసుంభః" అని సుశ్రుతుడు తన గ్రంథరాజంలో పేర్కొన్నాడు. కుసుము అని కూడా రాయలసీమ వ్యవహారం. ఇవి తెలంగాణా, రాయలసీమ, కర్ణాటక ప్రాంతాలలో ఎక్కువగా పండే నూనెగింజలు. తక్కిన ప్రాంతాలలో లేని పంట. కుసుబి, కుసు అనగా సన్నని ముళ్లులాగా కోసగా వున్న అని అర్థం. కుసుమలు మొనతేలి వున్నందున దీనికి కుసురు, కుసుము అని వ్యవహారం కలిగివుంటుంది. కుసుంబుశబ్దాన్ని సంస్కృతీకరించి పండితులు కుసుంభ అన్నారు. "పసిడి కమ్మల తోడి కుసుమపూవన్నియ నిద్దంపు బుట్టంబు నెఱయగట్టి" (కాశీ. 7-2) అని ప్రయోగం. దేశీనామమాలలో కుసుమణ్ణం = కుంకుమంపదం ఉంది. (2-41)

23, ణడిజ్జఇ :

ణఅరవసిఓ ణడిజ్జఇ (1-73)

"ఖేద్యతే ఇత్యర్థే ణడిజ్జఇ ఇతి దేశీ" అని వ్యాఖ్య. కష్టపడుతాడు అని అర్థం. నడిజ్జఅ అని పాఠాంతరం. "ణడియో వంచితః, ఖేదిత ఇ త్యన్యే" అని దేశీనామమాల. ఇది నలియు, నలచు కర్మణి రూపమే, చెవఇ (చెప్పుతున్నాడు), చజ్జఇ (చూస్తున్నాడు) మున్నగు ధాతువులు ప్రాకృతంలో చేరాయిగనుక నలి ధాతువు చేరడంలో ఆశ్చర్యం లేదు.

24. పక్కల :

పక్కలో త్తి చోరజుఆ (2-78)

"పక్కలో ప్రపీరోఽయువా. పక్కలశబ్దో దర్పవతి యూని వర్తతే" అని కులబాలదేవుడు అంటున్నాడు. "పక్కో దృప్తః.

సమర్థశ్చ" అని దేశీనామమాల. తెనుగులో మొక్కలుడు, మొక్కలి, మొక్కలీడు అనే పదాలు ముష్కరుడు, వీరుడు అనే అర్థంలో వున్నవి. పక్కలకు, మొక్కలక మూలరూపం మరొకటి వుంటుంది. లేదా మొదట మక్కల శబ్దమే మకారం 'మొ' కాగా మొక్కల అయివుంటుంది.

25. చటుఅం :

తం చటుఅంఅ కరంకం (2-62)

"చటుఅం భిక్షాదానపాత్రం- దర్వీతి యావత్" అని వ్యాఖ్య. "చట్టూ దారుహస్తః" అని దేశీనామమాల. చట్టువ శబ్దం గరిటె, తెడ్డు అనే అర్థంలో తెనుగు తమిళాలలో వున్నది. "ప్రక్షాళితంబైన పసిడి చట్టువమున నన్నంబు నునిచి నెయ్యభిఘరించి" (కాశీ. 7-147), "చట్టువం బొక చేత బట్టి ఖడ్గము నంక దగిలించి" (భార. విరాట. 1-211) హేమచంద్రుడు చట్టూ పదం దేశీనామమాలలో దారు హస్తంగా గ్రహించాడు. (3-1) ఇదీ, చటుఅం ఒక్కటే. ఇది తెడ్డు అయినప్పుడు చెట్టునుంచి పుట్టినదనడం స్పష్టం.

26. డోరో :

అణుహావఇ కణకడోరో (3-11)

కణకడోరో=కనకసూత్రం. డోరో, దారో కటిసూత్రమని దేశీనామమాలలో గ్రహించడం గమనించవలసిన సంగతి. డోరో, డోరా, ధారా అని ఉత్తర భారతీ భాషలలో వ్యవహారం కలదు. దారం, తోరము తెనుగు పదాలు. దోరో తెనుగు శబ్దంలాగానే కనిపిస్తున్నది.

27. లావణ్ణ ఉలే :

లావణ్ణఉదే అణంగ గఅ కుంభే (3-60)

లావణ్ణఉలే అని పాఠాంతరం. లావణ్యకుశే అని వ్యాఖ్య. పయోధరాలు లావణ్యకుంభాలు అని ప్రస్తుతవిషయం. ఉడే శబ్దానికి ఉలే అని ఉన్న పాఠాంతరం ఉళ్, లోపల అనే శబ్దానికి ప్రతిరూపమా అని సందేహం కలిగిస్తున్నది. లావణ్యానికి ఉళ్, వీడు, ఆశ్రయం అని పర్యవసితార్థం. లావణ్యకుశే అనే వ్యాఖ్యానంకంటే ఇది సమంజసంగా వుంటుంది. వత్థఉడో అనే శబ్దాన్ని "వస్త్రాశ్రయః, వస్త్రనిర్మిత ఆశ్రయ ఇత్యర్థః" అని దేశీవామమాలలో హేమచంద్రుడు వివరించాడు. వత్థఉడో=వస్త్రకుటః అనడం పొసగదు. ఉళ్ శబ్దమే ఉడో, ఉలోగా మారిందనే ఊహకు పై వాదం సాధకం. 'వీడు' పర్యాయమైన 'ఉళ్లు'శబ్దం ప్రస్తుతం వ్యావహారిక తమిళంలో వున్నది. తెనుగులో ఉళ్ 'లో' కాగా ఇల్లు, వీడు మున్నగునవి మాత్రమే మిగిలిపోయి వుంటాయి.

## 28. అవ్వో :

'ఆవ్వో!' పదం దుఃఖాశ్చర్య సంభ్రమాలలో పలుచోట్ల ప్రయుక్తమైంది. అవ్వో దుక్కర ఆరఅ—(3-73) ఇక్కడ సంభ్రమాశ్చర్యాలు. అవ్వో ఆణుణఅ సుహాసంఖిరీఅ—(4-6) ఇక్కడ కష్టం. ఉమ్ముల్లుఆఇ అవ్వో—(5-75) ఇక్కడ దుఃఖం. అవ్వో సోచ్చేఅ ఛణో—(6-35) ఇక్కడ దుఃఖాశ్చర్యాలు. ఆవ్వో కింపి రహస్సం—(6-60) ఇక్కడ ఆశ్చర్యం. దుఃఖాశ్చర్య సంభ్రమాలను తెనుగువారు అమ్మో, అవ్వో, అమ్మయ్యో అనే శబ్దాలతో ప్రకటిస్తారు. అవ్వ అమ్మకు ప్రాచీనరూపం; భారతాదులలో ప్రయుక్తం. ప్రస్తుతం కన్నడంలోను, తెలంగాణాలోను వ్యవహృతం. (దేశీనామ. అవ్వా=అంబా 1-5)

## 29. భిసణేమి :

భిసణేమిత్తి పిఅఅమం (5-12)

ఖసిణేమి, ఖసలేమి అని పాఠాంతరాలు. విచ్ఛురామి అని వ్యాఖ్య. విసరివేస్తాను. "ఖసణేమి ఇతి విచ్ఛురణే దేశీ" అని వ్యాఖ్యాత వివరణ. విసరు అనే ధాతువు ప్రాకృతవేష మిది. విసరు-బిసరు-బిసల-ఖిషణ అయివుంటుంది. వీస్, బీస్ అని తమిళ కన్నడ రూపాలు. విసరుగా పలకడంలో బి మహాప్రాణమయింది.

## 30. పుప్పుఆ :

పుప్పుఆ సుఆంధేణ (4-39)

"పుప్పుఆ=కరీషాగ్నా దేశీ" అని వ్యాఖ్య. పిడకల నిప్పు. "పప్పాడో అగ్ని భేదః" అని దేశీనామమాల. పిడక+నిప్పుక శబ్దాలు రెంటినీ కలిపి ఉచ్చరించేటప్పుడు కలిగిన వేగంవలన పిప్పుక అయి, మధ్యనవున్న పువర్ణసామ్యంవల్ల ప్రథమ పి వర్ణం పు వర్ణంగా మారి పుప్పుఆ అయివుంటుందని ఊహిస్తున్నాను. ఈ గాథ వ్రాసినవాడు అణ్ణఅ. ఇతడు తెలుగువాడుగా కనిపిస్తున్నాడు; పిడకల నిప్పు అనే తెలుగుశబ్దాలనే గ్రహించి వుండవచ్చును. పిడక శబ్దానికి పిడుచు మూలం. పుప్పుఆ శబ్దానికి ఇంతకన్న మంచి వ్యుత్పత్తి చూపితే ఆమోదించడం నిస్సంశయం. ఫూఫూ అని ఊదడంవల్ల కలిగిన అనుకరణ శబ్దంవల్లకూడా యిది పుట్టిన దనవచ్చు.

## 31. దే :

హిఅఅ దే విరమ ఎత్తాహే (4-45)

దే పహరసు వరాఈం (5-56)

దే సుఅణు పసిఅ ఏణ్హిం (5-66)

"దే శబ్ద స్సంబోధనే" అని వ్యాఖ్య. దే హిఅఅ=ఓ హృదయమా! ఎదుటివారి దృష్టి మరల్చడంకోసం "ఇదిగో చూడండి! ఇదో చూడండి!" అని మనం సంబోధిస్తుంటాము. వచ్చుధాతువు లోణ్మధ్యమైకవచనరూపం 'రాకు' మారుగా 'దా' అని మనం

వ్యవహరిసున్నాము. (దామ్మా దా...) సంబోధనార్థకంలో 'శివ దో!' శివలీలావిలాసంలో వున్నది దా! దే! దో! అనే సంబోధన రూపాలు ప్రాచీనకాలంలో వుండివుంటాయి. దా మాత్రం మిగిలి, దే దోలు జారిపోయాయి. దో అనే సంబోధనవాచకం ప్రస్తుతం మహారాష్ట్రంలోకూడా వున్నదని విన్నాను. ఇది తెలుగునుంచే పోయివుంటుంది.

32. పేఛిరీ :

పుణరుత్తపేఛిరీప (హాలస్స 4-71)

పునరుక్తమ్లేచ్ఛితకయా అని ఛాయ. "మ్లేచ్ఛితం గుప్త భాషితం" అని కులబాలదేవుని టీక. మ్లేచ్ఛిత శబ్దంనుంచి పేఛిరీ పుట్టివుంటుందనే భ్రాంతితో మ్లేచ్ఛితకయా అని ఛాయ వ్రాసి వుంటారు. పెచ్చారితనము=వాగుడు అనే అర్థంలో నాచనసోముడు ప్రయోగించాడు. "మచ్చరపు వాసుదేవుడు పెచ్చారితనంబు మాను పిల నిట్లనియెన్" (ఉత్తరహరి. ఆ 3). ఈ గాథలోని అర్థాన్నిబట్టి కూడా పెచ్చారితన మంటేనే సమంజసం. పేళ్ — పేచ్ ధాతువు నుంచి పెచ్చారి పుట్టివుంటుంది. ఈ ధాతువు తమిళంలో ఇంకా వున్నది; తెనుగున మరుగైపోయింది.

33. చోజ్జం :

బలిణో వాఆబంధే చోజ్జం (భోజఅస్స, 5-6)

చోజ్జం ఆశ్చర్యం. ఇది చుజ్జం అని చుకారాదిగా దేశీనామ మాలలో పఠితం. "చోద్యం స్యాద్ దద్భుతే ప్రశ్నే చోదనార్థేతు వాచ్యవత్" అని మేదినీకారుడు అన్నాడు. కాని చుదధాతువునుబట్టి ప్రశ్నార్థకానికీ, చోదనార్థకానికీ వ్యుత్పత్తి చెప్పవచ్చును గాని ఆశ్చర్యార్థానికి వ్యుత్పత్తి కుదరదు. ఇది పూర్తిగా తెనుగు పదం. సోజిగ, సొజ్జిగ అని కన్నడంలో ప్రాచీనరూపాలు. మేదినీకారుడు చెప్పినట్లు ఇది సంస్కృతమైవుంటే హేమచంద్రుడు దేశీనామ

మాలలో గ్రహించవలసిన అవసరం వుండదు. చోజ్జశబ్దానికి చోద్యం మూలరూపంగా వుండవచ్చుననే భ్రాంతితో సంస్కృత కవులు ప్రయోగించగా మేదినీకారుడు తన నిఘంటువులో గ్రహించాడు. దేశీనామమాల చుజ్జం అనే రూపంకూడా గ్రహించింది. (3-14)

34. ఉప్పంగో :

కామస్స లోహీ ఉప్పంగరాఇఅం (6-85)

"ఉప్పంగశబ్దో దేశ్యాం సమూహవచనః" అని వ్యాఖ్య. ఇది ఉప్పెన, ఉప్పెనగా అనే శబ్దాలనుంచి వచ్చిందేమో! దేశీనామమాలలో ఉంబర, ఉబ్బార శబ్దాలు అధికపర్యాయంగా గ్రహించబడినవి. ఇవి ముమ్మరం, ఉబ్బరం, ఉమ్మరం అనే తెలుగుశబ్దాలే ననడంలో సందేహం లేదు. ఈ శబ్దాలను అన్నిటా పోలిన ఉప్పంగ కూడా తెనుగుపదం కాకతప్పదు.

35. అత్థక్క :

అత్థక్క గజ్జఉబ్భంత (4-86)
అత్థక్కరూసణం (7-75)

"అత్థక్కేతి ఆకస్మికే, అద్భుతేవా దేశీ" అని వ్యాఖ్య. ఆశ్చర్యం తెలుపడానికి తెనుగువారు అమ్మక్క, అమ్మకచెల్ల, అమ్మయ్య మున్నగు పదాలు ప్రయోగిస్తారు. వీని పోలిక గల అత్థక్క శబ్దంకూడా తెనుగే; ప్రాకృతమో, సంస్కృతమో కాదు.

36. పలాల :

ఫాలేఇ అచ్ఛభల్లం
వ ఉఅహ కుగ్గామ దేఉలద్దారే,
హేమంత ఆల పహిఅ
విజ్ఝాఅంతం పలాలగ్గిం. (గాథాసప్త. 2-9)

ఈ గాథలోని వర్ణన అతి హృదయంగమంగా వున్నందున వివరిస్తున్నాను : చలికాలం, పల్లెటూరి దేవాలయం ముంగిట ఒక బాటసారి గడ్డినెగడు వేశాడు. ఆరిపోతున్న గడ్డినిప్పును కలియబెడు తుండగా ఎలుగుబంటిని చీల్చుతున్నట్టు వున్నది.

కాలిన గడ్డినిప్పు ఆరిపోగానే నల్లగా, పెద్ద రాశిగా కని పిస్తుంది. ఇది పొట్టచీల్చిన ఎలుగుబంటిలాగా వుందన్నమాట. దీనిని కవి ఎంత మనోహరంగా వర్ణించాడో !

ఇక్కడ గడ్డికి పలాల అని గాథాకారుడు ప్రయోగించాడు. "పలతి సస్యశూన్యత్వం ప్రాప్నోతి=పలాలః" అని శబ్దకల్పద్రుమ వ్యుత్పత్తి. "ప్రోక్షణా త్తృణధాన్యంచ పలాలంచైవ శుద్ధ్యతి" అని మనువు. శబ్దకల్పద్రుమ వ్యుత్పత్తి అసంమంజస మనడానికి వీలులేదు. కాని పుల్లి, పిల్లిరి శబ్దాలను తృణపరంగా దేశీనామమాల ఉదాహరించినప్పుడు పలాల శబ్దాన్నికూడా గ్రహించాలి. తెనుగు కన్నడ తమిళ బాషలలో పుల్ తృణసామాన్యవాచి. చిప్పర-చిర్ పుల్-పచ్చిక. పుల్లి, పిల్లిరి. పలాల శబ్దాలు పుల్ తద్భవరూపాలే. (దేశీనామ. 6-79)

37. అలాహి ;

అలాహి కిం పాఅరాపణ ? (2-27)

అలాహి=నివారణే. అక్కరలేదు అని అర్థం. అలాభి అని పాఠాంతరం. అలాహి శబ్దాన్ని నివారణపరంగా శబ్దానుశాసనంలో నిపాతం చేసినట్టు హేమచంద్రుడు దేశీనామమాలలో సూచించాడు. వ్యుత్పత్తి కుదరకనేకదా-పీడ విరుగడై పోతుందని-నిపాతంచేయడం! గాథలోని సందర్భాన్నిబట్టి అలాహి శబ్దానికి "అక్కరలేదులే, ఒల్లను పో !" అని అర్థం. ఒల్ల శబ్దంనుంచికాని, నిషేదార్థకమైన అల్ల శబ్దంనుంచికాని అలాహి పుట్టివుంటుంది. అల్ల, ఇల్ల, ఉల్ల శబ్దాలలో

ఇల్ల శబ్దం తెనుగులో లే అయి, ఉల్ల ఒల్లగా మారి, అల్ల వ్యవహార భ్రష్టమైంది.

38. ఉఅ ;

ఉఅ ఓల్లిజ్జఇ (7-40)

ఉఅ ణిచ్చలనిప్పందా (1-4)

ఉఅ పోమ్మరాఅ (1-75)

ఉఅ సంభమ విక్ఖిత్తం (5-61)

ఉఅ సింధవ పవ్వఅ (7-39)

ఉఅహ తరుకోడరాఓ (6-62)

ఉఅహ పడలంతరో (1-63)

"ఉఅ, ఉఅహ=పశ్య" అని వ్యాఖ్య. ఈ రెండు శబ్దాలూ పలు మారు ప్రయోగింపబడినవి. కొన్ని మాత్రమే పైన ఉదాహరించాను. ఈ రెండు శబ్దాలూ పశ్య అనే లోణ్మధ్యమపురుషరూపానికి నిపాతాలు. యథావత్తుగా అర్థం గ్రహించి నిపాతం చేయడంవల్లనే ఇవి దేశీ శబ్దాలని విస్పష్టమౌతున్నదికదా! తెనుగు ప్రాచీన సంబోధనరూపమైన ఓయి ఉఅ అయి, ఉఅహ అనే ప్రాకృతవేషంలో దర్శనం ఇస్తున్నదని నా ఊహ.

39. కఏ ;

(1) తుజ్ఝకఏ తహావి తహావి తనుఆఇ (హారిఆలస్స. 1-30)

(2) ఖణ కస్సకఏ కఓ మానో (5-32)

(3) జస్సకఏ ణం పిఅసహి (6-24)

(4) ధవలస్సకఏ జిఅంతి గిట్ఠీఓ (7-38)

ఇంకా కొన్ని గాథలలోకూడా కఏ ప్రయుక్తమైంది. ఇది

తెనుగు చతుర్థీవిభక్తి కయి-కై మారువేషం. ప్రాకృతంలో చతుర్థీ విభక్తి లేదు. నాశికలోని అశోకుని పాలీశాసనంలో చతుర్థీవిభక్తి కనిపించదు శౌరసేనీ ప్రాకృతంలో చతుర్థీవిభక్తి లేదనీ, మహారాష్ట్రి ప్రాకృతంలో అకారాంత శబ్దాలకు ఏకవచనంలో మాత్రం క్వాచిత్కంగా వుందనీ వుల్నర్ పండితుడు ప్రాకృత వ్యాకరణ ప్రవేశికలో తెలిపాడు (పుట 32, 38). తమిళభాషలో కు, అక్కు, కన్నడంలో గె, ఇగె, ఇంగే, ఇకే, కం, గం అనే చతుర్థీవిభక్తి ప్రత్యయాలు తెనుగు కై, కయిలను పోలివున్నవి. తెనుగు కై, కయి ప్రాకృతంలో కఏగా మారివుంటుంది. ఈ కఏను సాధించడంకోసం సంస్కృత పండితులు కృతే అనే అవ్యయాన్ని కల్పించుకొని సంతృప్తిపడ్డారు.

**40.** అనుకరణ శబ్దాలు;

(1) మాణో సురసురంతో (1-74)

సురసురంతో=సురసురలాడుతూ.

(2) హిఅఅం ధరధరేఇ (2-87)

ధరధరేఇ=తరతగలాడుతున్నది. "ధరహారిఅం కంపితం" అని దేశీనామమాల.

(3) హత్థా ధరహరంతి (2-65)

(4) ధుకాధుకఇ జీవం (6-83)

"ధుకాధుకఇ=హృదయే కంపో భవతి" అని వ్యాఖ్య. కుతకుతలాడుతున్నది జీవం.

(5) సణిఅం సణిఅం (5-58)

"సణిఅం సణిఅం=శనకైః శనకైః" అని వ్యాఖ్య. మెల్లిగా, సన్నగా. సన్నగా సన్నగా అనే తెనుగు శబ్దం సణిఅం సణిఅం పదానికి అన్నిటా పోలివుంది. సన్న, చిర్, చిన్న మున్నగు రూపాలు

అన్ని దాక్షిణాత్య భాషలలోను కలవు. కనుక ఇది తెనుగే నవడం అన్యాయం కాదు. ఇంకా మాట్లాడితే శనైః అనే అవ్యయానికి కూడా చిన్న, సన్న శబ్దాలే మూలమని ఘంటాఘోషంగా చెప్ప వలసి వుంటుంది.

హలహాలం=కామౌత్సుక్యం, ఓడహాఓ=తరుణ్యాః, హాఉల్ల అం=చిత్రం, ణవరం=కేవలం, తిత్తిల్లఓ=దౌవారికః, వేల్లహాలం= సుందరం, రింఛోళీ=సమూహం, హాల్లఫలం=కోష్ణసుగంధిజలం— మున్నగు ఉక్కు సెనగల వంటి శబ్దాలను మెదిపి గంధం తీయవలసి వుంది.

ఇంతకూ, దాదాపు రెండువేల ఏండ్ల క్రిందటి తెనుగు పదాలు ప్రాకృత సాహిత్యంలో ఎలా చేరిపోయాయో తెలుపడమే ఈ వ్యాసంయొక్క ఆశయం. సోపపత్తికంగా వున్న వాదాన్ని గ్రహించడానికి అభ్యుదయకాము లెవరూ వెనుకాడ రనుకుంటాను.

# గాథా సప్తశతిలోని నగ నట్ర

"నాన్నా నాకొక కంటె కొనివ్వవూ? మెడలో వేసుకొంటె చక్కగా ఉంటుంది!" అని అడిగింది నాలుగేళ్ల మా పాప నీరజ. "కంటె యేమిటమ్మా చాల పాతకాలం! నీకు కొత్త నెక్‌లెస్ చేయిస్తాలే" అని అన్నాను. "ఊహూం! నాకు కంటె కావాలి. అదే ఇప్పుడు ఫాషన్ అని పక్కింటి జయ చెప్పింది. దాని కంటే నీ కేమి తెలుసు ఫాషన్ సంగతి?" అని మందలించింది పాప నన్ను. "ఔనండీ! పాతవన్నీ మరీ ఇప్పుడు కొత్త ఫాషన్‌లు అవుతున్నాయి" అని సమర్థించింది మా ఆవిడ అనంతలక్ష్మి. చక్రనేమి క్రమమంటే ఇదే కాబోలు అనుకున్నాను. అయినా మన సంస్కృతి చక్రనేమి క్రమంకాదే, శంఖావర్త క్రమమే. శంఖంమీది వర్తులంలాగ చుడుతూ పైకి పోతుంది. ఒక్కొక్క వంపు తిరుగుతున్నప్పుడల్లా వచ్చిన స్థానానికే వస్తున్నట్టు అనిపిస్తుంది. కాని, తీరా దగ్గిరికి వచ్చేసరికి ఆ వంపు దాటి మరికొంత పైకే గమనం కనిపిస్తుంది. మరి పాత ఫాషన్‌లు రావడమేమిటి?—అని అనుకుంటున్నాను. ఇంతలోకే అడిగింది మా ఆవిడ. "కంటె పాతది పాతది అంటున్నారే; ఎంత పాతదండీ?" అని కోర్టులో క్రాసుపరీక్ష చేసినట్టు; అసెంబ్లీలో పాయింట్ ఆఫ్ ఆర్డరు అడిగినట్టూను. "రెండు వేలపండ్ల పాతది" అన్నాను. "చిత్రంగా ఉందే. అదేనా, ఇంకేమన్నా ఉన్నాయా?" అని మరొక అనుబంధ ప్రశ్న వేసింది. "ఇంకా ఎన్నో ఉన్నాయి" అన్నాను భట్టీయం పెట్టిన సాక్షిలాగ. "సరిగా ఇలాంటి నగలేనా?" అని మరొక ప్రశ్న విసిరింది న్యాయవాది ముద్దాయిని కార్నర్ చేస్తున్నట్టు. "దాదాపు ఇలాంటివే" అని సమాధాన మిచ్చాను పోలీసు సాక్షిలాగ. "మరి చెప్పరేమండీ వాటిని? కొత్త ఫాషను సృష్టించి కీర్తి కొట్టేద్దును

కదా !" అని చెప్పింది, ఇంతవరకు చెప్పకపోవడం నా తప్పే అయి నట్టు. "ఇప్పుడైనా చెప్పండి వాటిని. 'ఫాషన్ పితామహి' అయి పోతాను" అన్నది.

సంస్కృత నాటకాలలోని అంకావతరణంలాగ సాతవాహనుల నాటి తెలుగుసీమ నా ఎదుట అవతరించి పాద్రిపూల పరిమళం గుప్పున కొట్టి తల దిమ్మెక్కిపోయింది. ఉద్యానవనంలో విహరిస్తున్న ఇద్దరు ప్రేమికులు కనిపించారు. నిర్మల నీలాకాశం, మునిమాపువేళ. చిలుకలు బారులుకట్టి గూళ్ళకు చేరుకుంటున్నాయి. ప్రియు డన్నాడు: "ప్రియతమా, చూచావా ఆ చిలుకల బారును? ఆకా శంనుండి కిందికి వంపుగా ఎలా దిగుతున్నదో! గగనలక్ష్మి మెడ నుంచి జారి కిందికి పడుతున్న పచ్చలు, పద్మరాగాలు చెక్కిన కంటె లాగా లేదూ?" ప్రియురాలు విస్తుపోయి అలా చూస్తూనే ఉంది.

(ఉఅ పొమ్మరాఅ మరగఅ
సంవలిఆ ణహాఅలాఓ ఓఅరఇ,
ణహసిరి కంఠభ్భట్ట
వ్వ కంఠిఆ కీరరించోలీ. 1-75)

ఇంతలోకే గలగలలు - గాజుల గలగలలు వినిపించాయి. ఆ గలగలలోనూ ఏదో గాబరా ధ్వనించింది. ఒక వియోగిని! పతి దూరదేశం వెళ్లాడు. ఇదిగో వస్తాడు, అదిగో వస్తాడు అనుకుని చింతిస్తూ కాలం గడుపుతున్నదేమో, కళ్లుమూసుకొని పక్కపై పడుకుని పతి ధ్యానంతో! పతి సమీపించాడనే భ్రాంతి చెందింది కాబోలు! తన్ను తానే కౌగిలించుకుంది. చేతిలోని గాజులు గలగల మంటూ జారిపోయాయి. పాపం! ఆమెను భ్రాంతిలోనే ఉండ నీండి. భ్రాంతి కూడా ఒకప్పుడు సుఖదాయకమే. రజ్జు సర్ప భ్రాంతి మాత్రం భయావహం సుమండీ!

(సఅణే చింతామఇఅం
కాఊణ పిఅం ణిమీలిఅచ్ఛీఏ,

అప్పాణో ఉవఊఢో
పసిఠిల వలఆహిం బాహాహిం. 3-83)

ఎంత అమాయికురా లీమె! భర్త పరదేశం వెళ్లగానే బెంగ పడిపోయి, తామర తూడులాగ పసివాడిపోయింది. చెలికత్తెను అడుగుతుందిగదా—భర్తలు దూరం వెళ్లగానే ప్రతి వనిత చేతిలోని గాజులూ ఇలాగే పెరుగుతాయా? అని. బాగుందమ్మా బాగుంది. ఇలా అడక్కు. ఎవరైనా వింటే నవ్వుతారు (5-58)

అంతగా ఆఘాయిత్యం చేస్తున్న అత్తగారు అమాంతం చల్ల బడిపోయింది, ఎందుకూ, అక్కడ? కోడలిపైన కారాలు మిరియాలూ నూరేదే సదా సర్వకాలమూ. కాని, కుమారుడు ఊరిలో లేనట్టుంది. కోడలు పాదాభివందనం చేయబోగా రెండు చేతులలోని గాజులూ జారి కిందపడ్డాయి—తన పాదాలపైన. ఎంత రాతిగుండె గలదైతే మాత్రం, తన కుమారునికోసం వనరుతున్న కోడలిని కనికరించదూ? తనూ కంటతడి పెట్టింది (5-93).

ఈ దృశ్యం బాగుంది. అల్లుడు అత్తవారింటికి వచ్చాడు. అపరాహ్ణమైంది. అమ్మాయేమో తీరికగా పెరట్లో స్నానం చేస్తున్నది. ఒకే గాజుల గలగల? వాకిట్లో అరుగుపై కూర్చున్న అల్లుడి మనస్సు ఏగతి పడుతుందో మీరే చెప్పండి. ఆలస్యంగా ఎందుకు వచ్చాడట! ఉదయమే రాలేకపోయాడా? ఇంతకూ అమ్మాయి కేమి సరదాచెప్పండి తీరికగా గాజులను చప్పుడుచేస్తూ ఒళ్లు తోముకోడం? స్నానం చేస్తేమాత్రం ఆ గాజుల చప్పుడు ఎవరు విన మన్నారయ్యా అల్లుణ్ణి? బాగుంది. ఎవరిధ్యాస వారిది.

(అపరణ్హాగఅ జామా
ఉఅస్స విఉణేఇ మోహాణుకంఠమ్,
వహుఆఇ ఘరఫలోహర
మజ్జణపిసుణో వలఅసద్దో. 7-83)

ఉహు! ఎంత తమాషా అయినా గాజులు చిట్లగొట్టడం న్యాయం కాదు. ఆ అమ్మాయి అయినా ఏమీ ఎరగని భోళామనిషి అయివుండాలి. లేదా ఆమె ప్రియుడైనా వెర్రిబాగులవాడయి ఉండాలి. పెండ్లి పెటాకులూ లేని పిల్ల చేతిగాజులు చిట్లగొట్టి రట్టు చేస్తే ఏం సాధించినట్లు? (5-38)

ఇది మరీ బాగుంది. తన గుడ్డంత అన్నంముద్ద కనిపిస్తుంటే కాకి ఎందుకు ముట్టుకోదు? ఆ ఇల్లాలు పాపం తన భర్తమేలుకోసం కాకికి పిడచలు వేసింది. దానిలో విషమేమైనా కలిపిందా? హాయిగా తినరాదూ? ఏం? ఓహో! అదా సంగతి! విరహవేదనతో కృశించిన ఆ యిల్లాలి చేతిగాజు ఆ ముద్దచుట్టూ పడిందయ్యా. దానితో, అదేదో తనను పట్టుకోడానికి వేసిన ఉచ్చు అనుకొని కాకి ముట్టుకోడంలేదు. తన మనోవేదనలో ఆ యిల్లాలు తన గాజు సంగతే మరచిపోయింది.

(పాసాసంకీ కా ఓ
ణేచ్ఛతి దిణ్ణం పి పహిఅ ఘరణీప,
ఓఅంత కరఅలో గలిఅ
వలఅ మజ్ఝట్ఠిఅం పిండమ్. 3-5)

కాలం ఒకేరీతిగా ఉంటుందా? ఓడల బండ్లునువచ్చును. ఓడలు నా బండ్లమీద నొప్పగవచ్చున్ కదా! కలిమిలేములు కావడి కుండలు. ఒకప్పుడు ఈ ఇల్లాలు బంగారు కుండలాలు ధరించి, ఆ కుండలాల కాంతులు చెక్కిళ్లమీద పడితే మహాశోకులికేదేమో! కాలం మారింది. ఏమిచేస్తుందిమరి? తాటికమ్మలు పెట్టుకోవలసి వచ్చింది ఇంతకూ సహజసుందరులకు నగలెందుకులేండి? తాటికమ్మలైనా అందమిస్తాయి. తారకలైనా తరళత తెస్తాయి.

(పరిరద్ధకణఅ కుండల
గండత్థల మణహారేసు సవణేసు,

అణ్ణఅ సమఅవసేణఅ
పరిరజ్జఇ తాలవేంటజుఅమ్. 4-98)

అరెరె! ఎందుకామె కాటుక కంటినీరు కురిపిస్తూంది? పక్కనే ప్రియుడున్నాడే? ఎక్కడికైనా వెళ్లబోతున్నాడా? అలా ప్రయాణ సన్నాహమేమీ కనిపించదే? మరి ఎందుకా కంటిముత్యాలు? చెక్కిళ్లు తడిసిపోతున్నాయే? ప్రియుడుకూడా చేత్తో తుడుస్తున్నట్టున్నాడు?... ఓస్! రంగరజతభ్రాంతి అంటే ఇదే కాబోలు! ఆమేమో చెవులకు నీలాల దుద్దులు పెట్టుకుంది. మంచి జాతి నీలాలేమో— మెరిసిపోతున్నాయి కాంతులు చెక్కిళ్లమీద పడి. వాటికి తోడు వెన్నెల వెలుగు ఆ నీలాల కాంతి, వెన్నెలా కలిసి కాటుక కంటినీరులా కనిపించింది. దగ్గరవున్న ప్రియుడే మోసపోయి చేత్తో తుడిచివేయడానికి ప్రయత్నించినప్పుడు దూరంగా నిలబడి చూస్తున్న నాబోటివాడు చూచి భ్రాంతి పడడంలో అబ్బుర మేముంది?

(పుసిఅ అణ్ణాహారణేం
దణీల కిరణాహాఅ ససిమఊహో,
మాణిణి వఅణమ్మి సక
జ్జలంసు సంకాఇ దఇపణ. 4-2)

ఆ రైతుబిడ్డ నిజంగా అందంగా ఉన్నాడు. చెవితో నేరేడు చివురు చెక్కుకుని. అయితే ఆ జతరాలి కెందుకు ముఖం నల్లగైంది? ఎందుకలా అరమోడ్పు కన్నులతో అతనివైపే చూస్తూంది? (2-80)

నవయౌవనంతో మిసమిసలాడే ఆ విలాసిని చెవితో చెక్కుకున్న పూగుత్తి చెక్కిలిపై వాలడం బాగానే ఉంది. కాని, చెక్కిలి చక్కదనమంతా తాగివేస్తున్నట్టు ఊగిసలాడడం మాత్రం భరించలేమండీ! (5-39)

ఎవరి ఇష్టాన్నిబట్టి వారు ఇతరులను ఆదరిస్తారు; వస్తువులపై కూడా అభిరుచి చూపుతారు; గుణాన్నిబట్టి కానేకాదు. ఆ పుళిందుల

అభిరుచి ఏమిటో చెప్పండి. ముత్యాలుమాని, గురిగింజలనే గ్రహిస్తారు. ముత్యాలు వారికి లెక్కలోవి కావు. ఏనుగులను చంపి, ఎప్పుడుబడితే అప్పుడు సంపాదిస్తారు; గురిగింజలంతూ పరువు తగిలి నప్పుడే కదా పండుతాయి. 'అతి పరిచయాదవజ్ఞా' అని పెద్దలు ఊరికే అన్నారా ?

(ణగుణేణ హీరఇ జణో
హీరఇ జో ణేణ భావిఓ తేణ,
మోత్తూణ పులిందా మో
త్తిఆఇఁగుంజాఓఁ గేణ్హంతి. 4-40)

ఈ వ్యాధవధువంతూ మరీ గడసరి. ఏనుగు కుంభస్థలాలు చీల్చి సంపాదించిన ముత్యాల దండలు వేసుకుని, తన సవతులు సంతోషిస్తుంటే, తను అవన్నీమాని నెమలిపింఛం మాత్రం కొప్పులో తురుముకొని, మరీ ఇదిగా మురిసిపోతున్నది. (2-73)

ఆమె ఎత్తైన రొమ్ముపైన ముత్యాల హారాలకు తావు కనిపించలేదేమో ! యమున నీటిపై తేలాడే నురగలాగ అటూ ఇటూ దొర్లాడుతున్నాయి. (7-69)

శ్యామళబల వ్రతం — నిప్పులో కాలి, నీటిలో తడిసి చేసే వ్రతం - చేసినవారికిగాని ఉన్నతస్థానం లభించదు. ఓ ! బంగారు మొలత్రాడూ నీవు నిప్పులో కాలి, నీటిలో మునిగి శ్యామళబలవ్రతం చేశావు కనుక ఆమె మధ్యభాగాన్ని అలంకరించావు-అంటున్నాడు ఒక కాముకుడు ఒక కనక మేఖలాలంకృత అయిన కాంతను చూచి. ఇలాటి రోడ్ సైడ్ రోమియోలు లేనికాలం ఉందా ? (3-11)

తుమ్మెదలదే అదృష్టమంటే. బాగా వికసించిన కమల మందిరంలో మకరందం మస్తుగా తాగి, ఝుయ్ఁమంటూ బారులుకట్టి బయలుదేరుతాయి. చూచేవాడికివి వసంతలక్ష్మి నీలాల మొల నూలులాగ, - మణిమేఖలలాగ కన్పిస్తూ మహానందం కలుగుతుంది.

రుందారవింద మందిర

మఅరందాణంది అళిఅరింఛోళీ,

ఝణఝుఅఇ కరుణ మణిమే

హాల వ్వ మహుమాస లచ్ఛిఏ. 6-74)

ఇదిగో! ఇక్కడ బలే తమాషా జరుగుతున్నది. ఔను మరి? భార్యతే ఎప్పుడూ నమస్కారం చేయాలా భర్తలకు? భర్తలు చేస్తే ఏం పోయిందట? ఏమితప్పు చేశాడో ఏమో భార్య కాళ్ళపై పడ్డాడు. తప్పేమి పెద్దది కాదట. గడువుకు సరిగా ఇల్లు చేరుకో లేదు. పరదేశం వెళ్ళినవాడు మరి! ఆమేమో కొంచెం బిగుమానం మనిషి. వచ్చినవాణ్ణి పలుకరించలేదు. పట్టింపు లెందుకుతల్లీ! పతి దైవంకదా? అతడు సామాన్యుడా? గడసరి. వెంటనే కాళ్ళబేరం. 'అపరాధ సహస్రభాజనం' అని పాదాలపై పడ్డాడు; కిటుకు తెలిసి. అదృష్టవశాత్తు అందెలలో జుట్టు చిక్కుకుంది. ఆమె తటాలున వంగి విడిపించటం మొదలుపెట్టింది. అబ్బాయ్! ఇక అమ్మగారి కోపం చల్లబడినట్టే. లేకపోతే చిక్కెందుకు విడిపిస్తుంది?

(ణేఉరకోడి విలగ్గం

చిఉరం దఇఅస్సపాఅపడిఅస్స,

హిఅఅం పఉత్థమాణం

ఉమ్మోఅంతీ చ్చిఅ కహేఇ. 2-28)

పచ్చికపై పడిన మంచుబిందువుల, వాననీటి బిందువుల అందం ముత్యాలకు ఎక్కడిది? అమృత బిందువులలా ఉంటాయి. పచ్చల సూదికి చెక్కిన ముత్యాలలాగ మెరుస్తున్న ఆ బిందువులను నెమలి మెడ సాచి ఏరుకొని తాగడం ఎంత అందంగా ఉంది! (4-47)

ఏమిటి ఈ గణగణలు! ఎద్దు తెంచుకొని పరుగెత్తి వచ్చిందా ఏమిటి? మనిషిమాత్రం కనిపిస్తున్నాడు. ఎందుకేమిటి! అమ్మకా నికా గహపతిగారూ! కాదట. తన దున్నపోతు చచ్చిపోయిందట. దాని గంటలు పట్టెడట ఇది. ఎన్నో దున్నపోతుల సంతలకు వెళ్ళి

చూచాడట మరొక దున్నపోతును కొందామని! కాని ఆ పట్టెడకు తగినది కనిపించలేదట. కనుక విసుగెత్తి గంటల పట్టెడను అమ్మ వారి శాలకు అందించడానికి వెళ్తున్నాడట. ఇంత విశాల ప్రపం చంలో మంచి దున్నపోతా దొరక్కపోయింది? ఏమో ఎవరి పిచ్చి వారి కానందం. పట్టెడ మాత్రం మా బాగా ఉంది. గంటల నాదం...

(గహాపఇణా ముఅస్సైరిహా
దుందుఅ దామం చిరం వహేఊణ.
వగ్గసఆఇం ణేఊణ
ణవరిఅ అజ్జాఘరే ఒద్ధమ్. 2-72)

"పాతకాలపు నగల సంగతి తెలుపమంటే ఇదేమిటండీ పట్టెడ పట్టెడ అని పలవిస్తూ దిక్కులు చూస్తున్నారు వెర్రివారిలాగ?" అంది మా ఆవిడ. ఒక్కసారిగా మాయమైంది సాతవాహనులనాటి జీవనసౌందర్యం.

"ఏమీలేదు. రెండువేల యేండ్లనాటి నగలు తెలుపమన్నావు కదా అని గాథాసప్తశతి అనే రెండువేల యేండ్లనాటి గ్రంథంలోని గాథలను జ్ఞాపకం చేసుకుంటున్నాను" అన్నాను దొంగలాగ.

"మీ గాథాసప్తశతి గోథాసుప్తగతి ఎవరికి కావాలండీ? మననం చేసుకోండి తర్వాత. ఇప్పటికి పాపకు కంటె చాలు" అంది ఎంతో దయ చూపిస్తూ.

"కాంచనం కలుషాపహాం" అనుకొంటూ మిథ్యాజగత్తులో పడ్డాను.

# గాథా సప్తశతిలో నాట్య, నాటక రీతులు

ఇంగ్లండులో పదిహేడో శతాబ్దిని ఒకవింత జరిగిందట. నాటకాలు చూచి ప్రజలు పతితులై పోతారనే భయంతో ప్యూరిటనులు నాటకాలపై కత్తికట్టారు నాటకప్రదర్శనాలకు అవకాశమిస్తేకదా యీ చిక్కు?-అనే అభిప్రాయంతో దేశంలో ఉన్న రంగస్థలాలన్నిటినీ మూసివేయించారట!

మన స్మృతికారులు యీ ప్యూరిటనులకన్నా రెండాకులెక్కువ చదివినవారే. కావ్యాలాపాలు కూడదు; వాటినిమాని వేయాలి-అని శాసించారు. నటులు అపాంక్తేయులని బహిష్కరించారు. అయినా, అభినవగుప్తాచార్యుడు ప్రకరణాంతరంలో అన్నట్టు భరతమునికాలంనుంచి నేటివరకు మహానటులూ ఉన్నారు; నాటకకళా నశించలేదు. దీనికి కారణం నాటక కళ మానవుని జీవితంతో పెనవేసుకునిపోవడమే.

కళలకన్నిటికీ అనుకరణం మూలమైనట్టే, నాటక కళకు కూడా మూలం అనుకరణమే. చీమ చిటుక్కుమంటే బెదురు కన్నులతో చెదరిపోయే లేళ్ళూ, కలకలలాడే వసంతంలో కలగానం చేసే కోయిలలు, కారుమబ్బులు కమ్ముకొనగా మత్తిల్లి నర్తించే నమిళ్ళు ఆదిమానవునికి భావరాగతాళాలు (భరతం) నేర్పివుంటాయి. అయినప్పుడు మానవజాతి తొలి సాహిత్య భండారమైన వేదంలో రూపక బీజాలు కానరావడంలో వింతేమిటి?

ఋగ్వేదంలోని సరమాపణి సంవాదం, యమ-యమీ సంవాదం, ఊర్వశీ పురూరవ సంవాదం మన రూపకాలకు తొలి ఛాయలు. పిదప ఎన్నదగినది బృహదారణ్యకంలోని విదుషి, వాచక్నవి అయిన

గార్గి యాజ్ఞవల్క్యునితోను, అతని పత్ని మైత్రేయితోను జరిపిన బ్రహ్మమీమాంస. ఇవన్నీ ఛాయామాత్రం. కాని, పాణినికాలానికి నాటకాలు ప్రచురంగా ఉండటంమాత్రమేకాక కృశాశ్వ, శిలాలు లనేవారు నాట్యసూత్రాలను రచించినారనటానికి అష్టాధ్యాయే సాక్షి.

బౌద్ధయుగంలో రకరకాల రూపకాలు వెలసినవి. బుద్ధుడు స్వయం నాట్యశాస్త్రవేత్త అని బుద్ధుని తొలిజీవితచరిత్రమైన లలిత విస్తరంలో ఉదాహరించబడింది, (వీణాయాం, వాదే, నృత్యే, గీతే, పఠితే, ఆఖ్యానే, హాస్యే, లాస్యే, నాట్యే, విడంబితే...సర్వత్ర బోధి సత్త్వ ఏవ విశిష్యతేస్మ.) బుద్ధుడు రాజగృహంలో ఉన్నప్పుడు ఆయన శిష్యులు మౌద్గల్యాయనుడు, ఉపతిష్యుడు తమ నటన నైపుణి చూపారట. బింబిసారుని ఆస్థానంలో నాగరాజుల గౌరవార్థం నాటకం ప్రదర్శించబడిందట. బుద్ధునియెదుట రాజగృహంలో కువలయ అనే దాక్షిణాత్య నటి ఆయన చరిత్రనే అభినయించిందట. కుశ జాతకం, ఉదయ జాతకం, కనవేర జాతకం మున్నగు జాతక కథలలో నట సమాజ నాటక ప్రసక్తి పెక్కుసార్లు వచ్చింది.

ఇక, బృహద్రామాయణ రచనాకాలానికి శైలూషులు, సమాజాలు (నాటకమందిరాలు), నాటకాలు ప్రచురంగా ఉన్నట్లు పెక్కు నిదర్శనాలున్నాయి. (స్వయంతు భార్యాం కౌమారీం చిరమధ్యుషితాం సతీం, శైలూష ఇవ మాం రామ పరేభ్యో దాతు మిచ్ఛతి-అయోధ్యాకాండం. వాదయంతి తదాశాంతిం లాపయంత్యపి చాపరే, నాటకా న్యపరే స్మాహుః హాస్యాని వివిధానిచ-అయోధ్యాకాండం,) అరాజకం ఉంటే ప్రహృష్టులైన నటనర్తకులు ఉండరు. దేశాన్ని అభివృద్ధికితెచ్చే ఉత్సవాలు, సమాజాలు (నాటక మందిరాలు) పెంపొందవు-అని వాల్మీకి మరొకచోట అంటాడు.

అశోకచక్రవర్తికి నాటకాలంటే చాల ఇష్టమని గిర్‌నార్ శాసనంలో ఉల్లేఖించబడింది. ఉత్సవాల్లో నాటకాలు ఆడేవారని మహా

వంశం అంటున్నది. అశ్వఘోషుడు సౌందరనందుని(?) బౌద్ధమతదీక్షను ప్రకరణంగా రచించినాడు.

ఇక నాటికీ నేటికీ అభ్యుదయపథంలో అంగలువేస్తున్న తెలుగునాట, భావుకత పొంగిపొర్లే తెలుగుజాతికి నాటకాలు లేవంటే నమ్మడమెలాగు! కనిపించినదానినంతా కవితలోనే కనులపండువు చేసుకుంటూ, కలలుగాంచే తెలుగువాడు దృశ్యకావ్యాన్ని భావించక పోయాడంటే ఒప్పుకోవడ మెలాగు? నేటివలే నాడుకూడా కొందరు పైవారి ఉపేక్ష మన నాటకాలు నడమంత్రంలోనే ఖిలమై పోవడానికి కారణమై ఉంటుందా !

కాని తెనుగుజాతి నాట్యకళాసక్తికి, తెనుగువాని నాటక ప్రసక్తికి రెండువేల యేళ్ళనాటి సాక్ష్యంమాత్రం మనకు మిగిలింది. అదే గాథాసప్తశతి. గాథాసప్తశతి తెలుగుగడ్డపై వెలసిన రచన. ప్రజాకవులు రచించిన ఈ అమర గాథలను సేకరించి ప్రాకృత సాహిత్య వధువుకు అందచందాలు సంతరించినవాడు హాలసాతవాహ నుడు. హాలుని కాలం క్రీస్తుశకం ఒకటవ శతాబ్దమని పండితుల నిర్ణయం. దీనిలో మంగళవారం అని వారప్రసక్తి ఉన్నది గనుక- తేదీతోపాటు వారం పేర్కొనటం 4వ శతాబ్దినుంచే ప్రచారంలోకి వచ్చినందున-ఈ గాథాసంపుటి అంత ప్రాచీనం కాదనేవారున్నారు. కాని రుద్రదాముని శాసనంలో గురువారం పేర్కొనబడింది గనుక (ఫాల్గుణ బహుళ సద్వతీయా గురువాసరే సింహాలపుత్రస ఓపశతస గోత్రస) రామకృష్ణ గోపాల్ భండార్కర్ వంటి పండితులు దీనిని క్రీస్తుశకం ప్రథమ శతాబ్దిగానే నమ్ముతున్నారు. తెలుగునాడు నేలిన ఈ కవిరాజు గుచ్ఛరించిన ఈ గాథలలో దేశీపదాలు-ముఖ్యంగా తెలుగు పదాలు, తెలుగు సంప్రదాయమూ వెల్లివిరియక మానవుగదా! (గాథాసప్తశతిలో తెలుగు పదాలు అని "భారతి" సర్వధారి చైత్ర సంచికలోని నా వ్యాసం చూడగోరినాను. అది ఈ సంపుటిలో మొదటి వ్యాసం.)

హాలుని ఈ గాథాసప్తశతిలో అప్పటి జానపద జీవితం పరీవాహమై ప్రవహించింది. పుట్టుకలు, పెండిండ్లు, సమర్తలు, అల్లుండ్ల అలకలు, ముద్దరాళ్ళ ముచ్చటలు, ఉత్సవాలు, ఊరేగింపులు, నాట్యాలు, నాటకాలు, వినోదాలు, విలాసాలు-అబ్బ! గ్రామజీవన సౌందర్య భండారం ఈ సప్తశతి. మనం వారి నాట్యం, నాటకం, సంగీతం ఎలా ఉన్నాయో చూచి ఆనందిద్దాం.

గానం :

సంగీతమంటే ఆనందావిర్భావమన్నారు పెద్దలు. మనసులో మోదం ముప్పిరిగొన్నప్పుడు కూనిరాగాలు వాటంతటవే వస్తాయి. మరి పైరు కోర్కెదైవారగా పండింది. ఇక రైతు దంచినబియ్యంలా ఉన్న శరత్కాలపు వెన్నెల రాత్రులలో హాయిగా గొంతువిప్పి ఎందుకు పాడడు ?

(ణిప్పణ్ణ సస్సరిద్ధీ
సచ్ఛందం గాఇ పామరో సరఇ,
దలిఅ ణవ సాలి తండుల
ధవల మియంకాసు రాఈసు. 7-89.)

కొందరు పాడుతూవుంటే ఏడిచినట్టు ఉంటుంది. కొందరు ఏడుస్తూ ఉన్నా కాకలీస్వరంగా వినిపిస్తుంది. పాపం! ఒక ఇల్లాలు పాట పాడుతూవుంది. కాని, అది పాటగాలేదు. భరింపరాని ఆవేదన, ఉత్కంఠ, కోపంతో కంఠం గద్గదమైపోయి తడబడుతున్న మాటలు-ఇవన్నీ వింటే ఎవరినో తలచుకుని గేయమనే నెపంతో ఏడుస్తున్నట్టు తోస్తుంది.

(గైఅచ్ఛలేణ భరి ఉం
కస్సతుమం రుఅసి ణిబ్భరుకణ్ఠమ్,
మణ్ణు పరిరుద్ధ కంఠ
ద్ధణింత ఖలిఅక్ఖ రుల్లావమ్. 4-84.)

## మంగళగీతం

వివాహం మానవుని జీవితంలో మధురాతిమధుర ఘట్టం పెండ్లికొడుకుమాట అలా ఉండగా, పెండ్లికూతురు మనస్సు భావ శబలతతో ముసురుకొని ఉంటుంది. ఒకవైపు చెలుల సయ్యాటలు, మరొకవైపు ముత్తయిదుల-మంగళగాయికల-మంగళగీతాలాపాలు. ఆ గీతాలలోనే వధూవరుల పేర్లూ కలిపి పాడటం నేడుకూడా ఐదు నాళ్ళ పెండ్లిండ్లలో ఆచారం. ఈవిధంగా మంగళగాయికలు మంగళ గీతాలు పాడుతూ ఉంటే చెవులు రిక్కించుకుని వింటున్న ఆ పెండ్లి కూతురు ఒళ్ళు పులకరించి పోతున్నది చూచారా?

(గిజ్జంతే మంగల గాఇఆహిఁ
వరగోత్త దిణ్ణ అణ్ణాఏ,
సో ఉం వ ణిగ్గఓ ఉఅహ
హోంత వహూఅఇ రోమంచో. 7-42)

వధువు ముగ్ధ అయితే, ఈ ఉత్కంఠా, ఉత్సాహమూను. మరి అదివరకే పదీ పరకామంది రసికులు చవిచూచి ఉంటే? వివాహ మంగళోద్గీతం విని నివ్వెరపోదూ ఆ మిటారి? ఆ పాత చెలికాండ్లు, సంకేతస్థలాలు నవ్వుతున్నట్టు, వెక్కిరిస్తున్నట్లు తోచదూ!

(మణ్ణే ఆఅణ్ణంతా
అసణ్ణ వివాహ మంగలుగ్గాఇమ్,
తేహిఁ జు ఆణేహిఁ సమం
హసంతి మం వేఅస కుడంగా. 7-43.)

పటహం :

పండుగలు పబ్బాలంటే పట్టణాలలో అంతసంరంభం కనిపిం చదుగాని, పల్లెపట్లలో హడావుడి ఎక్కువ. అడ్డదిడ్డంగా పరిగెత్తే జనం, ఎక్కడచూచినా ఆనందకోలాహలం, తూర్యారావాలు-మరి

మహోత్సాహంగా ఉండదూ! కాని మనకు ఇష్టమైనవారు ఆ ఉత్స వానికి రాలేదనుకోండి. ఎందుకీ ప్రళయం! ఊరు కాలిపోతున్నట్టు ఎందుకీ పరుగులు? ఎందుకీ కేకలు? తూర్యాలు (నగారాలు) వాయించి అయినా జనాన్ని చేర్చడమెందుకు?-అనిపిస్తుంది. మనస్సే కారణం అన్నిటికీని!

(ఉప్పహ పోవిహా జణో
పవిజింపిఅ కలకలో పహాఅతూరో,
అవ్వో సో చ్చేఅ ఛణో
తేణ విణా గామ దాహోవ్వ. 6-35.)

ఇష్టులుదగ్గర ఉన్నప్పుడు ఇంపుగా ఉన్నవి, వారు దగ్గర లేన ప్పుడు ఇంపుగా వుండవు. వానకారు ఎంతసొంపైనది! ప్రియునితో ఆ సుందరి ఆ వర్షర్తులో ఎంత ఇదిగా గడిపింది! ఆయన దూరమ య్యాడు, ఉరుములు విన్నది. తప్పు చాటుతూ నేరగాడిని వధ్యస్థానా నికి తీసుకువెళ్లేటప్పుడు వాయించే తప్పెటమోతలాగ-పటహ ధ్వని లాగ-విని అదరిపడింది.

అజ్జ మఏ తేణ విణా
అణుహూఅ సుహాఇఁ సంభరంతీ ఏ,
అహిణవ మేహాణఁ రవో
ణిసామిఓ వజ్ఝపడహోవ్వ. 1-29.)

తడితే పాపనిద్రపోతుంది; తప్పెట కొడితే పసివాని కాళ్ళు అప్రయత్నంగా చిందులు తొక్కడానికి పైకి లేస్తాయి. ఇక మంచి ఇల్లాలు మగడుకొట్టే పటహానికి-తప్పెటకు-చిందులు తొక్కడంలో వింతేముంది? తప్పెట తడాఖా అలాంటిది!

(అణత్తం తేణ తుమం
పఇణో పహాపణ పటహాసద్దేణ,
మల్లి ణ లజ్జసి ణచ్చసి
దోహగ్గే పాఅదిజ్జంతే. 7-85.)

ఢక్క :

ఏనుగును చూస్తే చాల నవ్వూ, దుఃఖమూ కలుగుతాయి. ఎంత మహాకాయం? మామూలు మానవునికి లోబడి కుక్కలాగ మాట విని, పిల్లిలాగ అణగి ఉంటుంది. పూర్వం రాజులు యుద్ధాలకు వెళుతుంటే ఢక్కలు, నగారాలు మోసుకుని వెళ్ళేది; కోట కవాటాలు బద్దలు కొట్టేది; అంత విజయమూ సాధించి తనది కాదన్నట్టు ఏ రాజునో అంబారీలో ఊరేగించేది. తన కీర్తికోసమే ఈ నగారాలు మోయడం అంటాడు ఒక అజ్ఞాత గాథాకవి.

(ధూలిమఇలో వి పంకం
కిఓ వి తణరఇఅ దేసాభరణోవి,
తహ వి గఇందో గురు అ
త్తణేణ ఢక్కం సముప్వహఇ. 6-26.)

మద్దెల :

దుర్మార్గులు మద్దెలవంటివారు. అన్నం పెడుతున్నంతసేపూ చక్కగా పలుకుతారు. మానివేశామా, మూతి ముడుచుకుంటారు. ఇలాటి రెండు ముఖాలవారికి దూరంగా ఉందామా అంటే కుదరదు. ప్రతివారి అవసరమూ ఈ మాయలోకంలో తప్పదుగదా!

(అఉలీనో దోముహఓ
తా ముహరో జోఅణం ము హే జావ,
మురఓ వ్వఖలో జిణ్ణ
మ్మి భోఅణే విరస మారసఇ. 3-53.)

నృత్యం :

నృత్యం జీవికి సహజమైన క్రియ. ప్రకృతితో కలిగే సుందర పరిణామం జీవిని ఆనంద తన్మయుని చేస్తుంది; దానితో సంగీతం, నృత్యం బయలుదేరుతాయి. హృదయం కరిగిపోయి కారుమబ్బులు,

ఎచ్చట చూచినా సుందర శీతల ప్రకృతి. ఇక నెమళ్ళు నీలాల మెడను చాచుకుని గంతులేయడంలో ఆశ్చర్యమేముంది? నెమలి నర్తనం చూచేఉంటారు మీరు; భరతంలో ఆరితేరినవారివలె అడుగు లేస్తుంది.

(అహిణవ పాఉస రసిఏసు
సోహఇ సాఆఇఏసు దిఅహేసు,
రహస పసారిఅ గీవాణం
ణచ్చిఅం మోర వుందాణం. 6-59.)

కొందరు తాము ఆడరు; వాద్యాలు వాయించి ఇతరులను ఆడి స్తారు. ప్రతి రంగంలోను ఇలాంటి వారుంటారు. పరవాద్య నర్తన శీలులు తర్వాత సిగ్గుపడినా, ఆడించేవారికేమో ఆనందంగానే ఉంటుంది.

(అహా సో విలక్ఖహిఅఓ
మఏ అహవ్వాఏ అగహిఆణుణఓ,
పరవంజ ణచ్చరీహిం
తుంహేహి ఉవేక్ఖిఓ ణేంతో. 5-20.)

కొందరు ధైర్యంతో అన్ని పనులూ చేస్తారు; కొందరు చేయరు; ఏదో నెపంతో పని అయిందనిపించుకుంటారు. చూడండి! ఆ గోపికకు కృష్ణుని ముద్దాడాలనే ఆశేమో ఉంది. సాధ్యంకాలేదు. మరి ఏం చేసింది. భేష్, బాగుంది! బాగా నర్తనం చేశావు-అని సాటి గోపికలను అభినందించే సాకుతో వారి బుగ్గలపై ప్రతిబింబించిన కృష్ణుని ముద్దాడుతుంది. ఇదీ మంచి ఎత్తేసుమా! ఒక దెబ్బతో రెండు పిట్టలు.

(ణచ్చణ సలాహణ ణిహేణ
పాస పరిసంఠిఆ ణిఉణ గోవీ,
సరిస గోవిఆణఀ చుంబఇ
కవోల పడిమాగఅం కణ్హం. 2-11.)

కొందరు హితవు చెప్పినట్టే చెప్పి వినేవారిని పెడదారి పట్టిస్తారు, బాలింతరాలిని, ఆరునెలల గర్భిణిని, ఒక రోజు జ్వరంతో పడి లేచినదానిని, నాట్యం ముగించి అప్పుడే రంగస్థలంనుంచి దిగిన దానిని-రంగోత్తీర్ణను ప్రేమించు-అని సలహా యిస్తారనుకోండి. ఏం బాగుంటుంది ?

(మాసపసూఅం ఛమ్మా
సగబ్భిణిం ఏక్కదిఅహ జరిఅంచ,
రంగుత్తిణ్ణం చ పిఅం
పుత్తఅ కామంతఓ హోహి. 3-59.)

పూర్వరంగం :

ఆత్మీయులు సన్నిహితులైనప్పుడు వారిని తాకితేగాని సంతృప్తి కలుగదు. తల్లి తన బిడ్డలను తలనుండి కాళ్ళవరకు సవరి తబ్బుకుంటుంది. తండ్రి తన సాటికొడుకును కౌగిలించుకుంటాడు. ఇక ప్రేయసీ ప్రియులు కలుసుకున్నప్పుడు ఒక్కటైపోతారు. ఈ పరిష్వంగం, అవగూహనం, కోపాలను, తాపాలను కరిగించివేస్తుంది; ఒంటికంతా ఆప్యాయత కలిగిస్తుంది. ఇలాటిదానిని రతినాటక పూర్వరంగమని కవి ప్రశంసించడం సహేతుకం కాదంటూరా? ఆ అవగూహనానికి భద్రం కలుగనీ !

(మాణదుమ పరుసపవణస్స)
మామి సవ్వంగ ణివ్వుఇఅరస్స,
అవఊహణస్స భద్దం
రఇ ణాడఅ పువ్వరంగస్స. 4.44.)

గాథాసప్తశతిలోని ఈ వర్ణనలనుబట్టి తెలుగు దేశంలో రెండు వేల ఏళ్లనాటికే చక్కని సంగీతం, పటహం, మురజం, ఢక్క, తూర్యం వంటి వాద్యాలు; నృత్యం, నాట్యం వంటి నాట్యరీతులూ ప్రచారంలో ఉండడం అలా ఉండగా; రంగం, సంపూర్ణ నాటక రంగం ఉన్నట్టు స్పష్టమౌతుంది.

# గాథాసప్తశతిలో గ్రామజీవన సౌందర్యం

రాజకీయప్రాబల్యం, సాహిత్యప్రాచుర్యం గల భాషలు ఇతర భాషలను, జాతులను లోగొంటాయి. పూర్వం మతానికి, రాజకీయాలకూ అంతరం లేదుగనక సంస్కృతభాష ఇతర భారతీయ భాషలను కొన్ని శతాబ్దాలవరకూ తల ఎత్తనివ్వలేదు. మతంతోపాటు వ్యాపించిన సంస్కృతం విభిన్నజాతులతో, సంఘాలతో సంబంధం ఏర్పడిన కొద్దీ వాటి భాషల పదాలనూ, భావాలనూ ఆకళించుకుంది. అన్యభాషాపదాలను, సంప్రదాయాలను సంతరించుకోనక పోయివుంటే సంస్కృతసాహిత్యం ఇంత విస్తృతం, సమృద్ధం అయివుండేదేకాదు.

బుద్ధభగవానుడు తన అభిప్రాయాలను ప్రకటించింది పాలీ భాషలో. బుద్ధుని సందేశాలు, మతం, పాలీభాష అశోకునికి ముందే దక్షిణాపథానికి, ముఖ్యంగా ఆంధ్ర, మధ్యదేశాలకు వచ్చాయి. అశోకుడు వానిని వ్యాపింపజేశాడు. మతభాష అయిన పాలి క్రమంగా రాజకీయభాష అయింది. ఈవిధంగా బౌద్ధ, జైన మతాలద్వారా దక్షిణాపథంలో పాకుతున్న పాలీ ప్రాకృతాలు సంస్కృతంవలెనే దేశభాషల సంప్రదాయాలనూ, శబ్దజాలాన్నీ సొంతంచేసుకున్నాయి. ప్రాకృతంలో మిళితమైపోయిన రోలంబ, రింఛోళి, తాలూరాది దేశి శబ్దాలను సంస్కృత మహాకవులు కూడా గతానుగతికంగా ప్రయోగించగా, నిఘంటుకారులు కూడ వాటిని స్వీకరించి, సంస్కృత ముద్ర వేశారు.

ప్రాకృతంలో తెనుగు సుబంతాలమాటలు వుండగా చెప్పు, చెక్కు, చూచువంటి తిజంతాలు చవఇ, చలఇ, చచ్ఛఇ మున్నగు

మార్పులతో గుర్తింపరానంతగా చేరిపోవడంవల్ల ఆచార్య హేమ చంద్రుడు దేశిశబ్దాలకు అన్వయమే కుదరదని అన్వయం కుదిరినా అర్థంకావడం కష్టమని అన్నాడు[1] దేశికి వ్యుత్పత్తి తెలియనందున ప్రాచీన సంప్రదాయసిద్ధమైన అర్థాన్నే గ్రహించాలని హేమచంద్రుడు ఆదేశించాడు. దేశిశబ్దాలు అర్థంకాక తప్పుడు వ్యాఖ్యలు చేసినవారిని "ఇప్పటి దేశికవులవి, వ్యాఖ్యాతలవి ఎన్ని తప్పులని ఏరను?" అని కష్టపడ్డాడు.[2]

గాథాసప్తశతి తెలుగుగడ్డపై వెలసిన రచన. ప్రజాకవులు పలికిన ఈ అమరగాథలను సేకరించి ప్రాకృత సాహిత్యవధువును కై సేసినవాడు హాల సాతవాహనుడు. తెనుగుగడ్డనేలిన హాలుడు సేకరించిన ఈ గాథలలో దేశిపదాలు, ముఖ్యంగా తెలుగు పదాలు, సంప్రదాయమూ వెల్లిఁరియకమానవు కదా! సాహిత్యం జాతిజీవన ప్రతిబింబమనే అన్నారు గనుక తెనుగుజాతి జానపదలావణ్యం ఈ గాథలలో తొణికిసలాడుతున్నదన్నా ఆశ్చర్యంలేదు.

"ఊరిమీద నూరుపడినా కరణంమీద కాసుపడదు"-అన్నది పల్లెటూరి సామెత ఒకజాతి నాగరికత మరొకజాతిని, దేశాన్ని ముంచెత్తినా, పల్లెట్ల పసదనంమాత్రం చెక్కుచెదరదని చెప్పడానికి మనం ఈ సామెతను ఉపయోగించుకొందాము. పదులతుల పల్లెలకు పట్టుగొమ్మైన భారత దేశంలో-ముఖ్యంగా ఆంధ్రదేశంలో ఈనాడు పల్లెపట్లలో కనిపిస్తున్న నాగరికతకు గాథాసప్తశతి నాటి గ్రామ

1. దేశీ దుస్సందర్భా, ప్రాయస్సందర్భితాపి దుర్బోధా,
ఆచార్య హేమచంద్రః తత్తాం సందృభతి, విభజతి చ,
-దేశీనామమాల.

2. అధునాతన దేశీకారాణాం తద్వ్యాఖ్యాతౄణాంచ కియంత స్సమ్మోహాః పరిగణ్యంతే.
-దేశీనామమాల, అష్టమసర్గ 12వ ఆర్య.

నాగరికతకు ఎక్కువ అంతరం లేదంటే ఎక్కువ ఆశ్చర్యపడనక్కర లేదు.

ఇప్పటి పల్లెల పరిస్థితి,-గ్రామాధికారుల పెత్తనం, అధికారుల బంధువుల పెత్తనం, తంటాలు, పంటలు అందరికీ తెలిసినవే. జానపదుల వేషభాషలు, వయ్యారాలు, సరాగాలు, సాహసాలు, విలాసాలు, వినోదాలు, అప్పటిలాగే ఇప్పుడు సహజసుందరమైనవే. ప్రొద్దుగూకగనే పల్లెపెద్దలు రచ్చచావడిమీదనో, గుడిముందరనో కొలువుతీర్చి రాచకార్యాలు చక్కబరచుకొంటున్న సంగతి మనకేమీ కొత్తదికాదు. రెండువేల సంవత్సరాలనాడూ మన జనపదాల పద్ధతి ఇదేనా-అని అబ్బురం పడేవారు నాతో రండి, హాలునికాలపు గ్రామాలు కొన్ని చూచివద్దాం:

రండి! రండి! ఏదో కోలాహాలం వినిపిస్తున్నది! ఏమిటిది? ఏదో పండుగలాగ ఉందే! జాతర కాబోలు! ఆడ, మగ ఇటు అటు పరుగెత్తుతున్నారు. తూర్యారావాలు వినిపిస్తున్నాయి. గాలిలో ఏమీ వినపడడంలేదు.[3] ఏదో పొడి చల్లుకుంటున్నారు.[4] ఆడ, మగా భేదం లేకుండా బురద కూడా ఒకరి మీద ఒకరు చల్లుకుంటున్నారు తప్పలేదు కాబోలు![5] ఏమిటా తూలటం! తాగారా ఏమిటి! ఆఁ. తాగారు జంటలు జంటలుగా నాట్యాలు చేస్తున్నారు. జుట్టుముళ్లు జారిపోతున్నాయి.[6] కుసుమరంగు చీరలవారు, చెంగావి చీరలవారు!

---

3 ఉప్పహాహోవిహాజణో పవిజజీమ్మియ కలఅలో పహాఅతూరో,
అవ్వో ణోచ్చేఅ భణో తేణ విణా గామదాహోవ్వ. 6-86

4. ఘేత్తూణ చుణ్ణముట్ఠిం హారిసూససిఆఏ వేవమాణాఏ,
భిసిణేమి త్తి పిఅఅమం హత్థే గంధోదఅం జాఅం. 4-12

5. ఫగ్గుచ్ఛణ ణిద్దోసం కేణవి కద్దమ పసాహణం దిణ్ణం,
థణఅలసముహపలోట్టంత సేఅధోఅం కిణో ధువసి. 4-69

6. దఇఅ కరగ్గహాలులిఓ ధమ్మిల్లో సీహుగంధిఅం వఅణం,
మఅణమ్మి ఏత్తిఅం చిఅ పసాహణం హరఇ తరుణీణం. 6-44

పైటలు గాలికి ఎగిరిపోతున్నాయే. బోసి రొమ్ములు ! అబ్బ ! ఒక రిద్దరు కుసుమరంగు రైకలు తొడుక్కున్నవారూ వున్నారు. ఏం జాతర ఇది![7] మనహోలీలాగుందే. ఆఁ!ఆఁ! హోలీయే. లేకపోతే ఈ విచక్షణ లేని పరవశ్యమిటి? పూర్వాంధ్ర ప్రాంతంలో నేడు ఇది లేదు గాని, పశ్చిమాంధ్రంలో బాగా అలవాటే. ఇంతకూ నేడు ఫాల్గుణ శుద్ధ పూర్ణిమ కాదూ !

దగ్గిరకు వెళ్ళి చూద్దాం రండి. వారంతగా సంబరపడుతూంటే మనం మాత్రం ఆనందించగూడదూ మరి ? ప్రకృతిదేవి వీరికి కింకరి అయిందా ఏమిటి ! పూలు, మొగ్గలు, చివుళ్ళు కనిపిస్తున్నాయే ! కొప్పునిండా పూలు. కొప్పులు పూలను వుమ్మివేస్తున్నట్టు లేవూ ! ఉత్సవానికి అనుగుణమైన వేషాలు ![8] చెవులమీదినుంచి ఏమిటి ఆ వ్రేలాడే నగలు ! చెంపసరాలా ! జూమికీలా ! అబ్బే ! పూలు, చివుళ్ళూను. నల్ల కలువలు, నేరేడు చివుళ్ళు,[9] పాద్రిపూగుత్తులు, ఇప్పపూగుత్తులు, విరజాజులు. మరువం, ఊడుగుచివుళ్ళు, రెల్లుపూలు, కొనకివెదురాకులు కూడ చెవి సందున ఇరికించుకున్నారే ! ఆ చక్కని చుక్క చెవిలోని పూలు ఆమె చెక్కిలి చక్కదనాన్ని వంగి తాకుతున్నట్టు లేదూ?[10] మగవారు కూడా ఈ కర్ణావతంసాలు ధరించారు; తల్లో పూలు కూడా తురుముకున్నారు. ఆ రైతు బిడ్డ తలలో చూడండి మామిడి పూగుత్తి ! దానిచుట్టూ తుమ్మెదలు ఎలా వెంట

---

7. గామ తరుణీఓ హిఅఅం హరంతి ఛేఆణ థణహారిల్లీఓ,
మఅణే కుసుంభరంజిఅ కంచుఇఆహరణమేత్తాఓ. 6-45

8. పిఅదంసణ సుహరస మఉలిఆఇ జఇ సే ణ హోంతి ణఅణాఇం,
తా కేణ కణ్ణరఇఅం లక్ఖిజ్జఇ కువలఅం తిస్సా. 4-28

9. సామాఇ సామలిజ్జఇ అద్ధచ్ఛిపలోఇరీఅ ముహసోహా,
జంబూదలకఅ కణ్ణావఅంస సథరిప హలిఅఉత్తే. 2-80

10. సామాఇ గురుఅజోవ్వణ విసేస సథరిప కవోల మూలమ్మి,
పిజ్జఇ అహోముహేణ వ కణ్ణవఅంసేణ లావణ్ణం. 5-89

బడి తిరుగుతున్నాయో ![11] ఆ పెద్దమనిషి తల్లోని పాద్రిపూలు గుప్పుమంటున్నవి.[12] ఎవరండీ ఆయన ? గ్రామాధికారో, ఆయన కుమారుడో అయివుంటాడు. లేకపోతే అంతఠీవి, అంత హంగు ఎందుకు ! అవును ! గ్రామాధికారే-గ్రామణియే.

అందరూ ఎంత ఆనందంగా మైమరచి మైకంతో తిరుగుతున్నారో ! ఉండనివ్వండి. మనం గ్రామానికి వెళ్ళి విశ్రాంతి తీసుకొందాం.

పొలిమేరలోనే ఏమిటి గుడిలాగా వుందే? గ్రామదేవతదా? ఆఁ! గ్రామదేవతదే ఉద్వాసన చేసినప్పుడు వేసిన పూలమాల-అవమాలిక ఎండిపోయి అలాగే గాలికి ఎగురుతున్నది.[13] ఇటువైపు కొలను. కొలనిలో తామరపూలు. పచ్చల పళ్ళెంమీద పెట్టిన శంఖం లాగా తామరపాకుమీద కదలక మెదలక ఉన్న ఆ కొంగను చూడండి.[14] ఇదేమిటి ! పీతలాగవుందే ! కాదు. వాలుంకిట అంటే ఒల్లెంక. కాలివేళ్ళకు చుట్టుకుంటుంది. పాపం ! పుటుపుటుమని కాళ్ళుకాస్త విరిగిపోయాయి.[15] చూచి అడుగువేయండి నలికిరి తోకలాగ వుంది.

---

11. ణక్ఖక్ఖుడిలం సహాఆరమంజరిం పామరస్స సీసమ్మి,
బందిమ్మివ హీరంతం భమరజుఆణా అణుసరంతి. 4-31

12. గామణిఘరమ్మి అత్తా ఏక్కచ్చిఅ పాడలా ఇహగ్గామే,
బహుపాడలంచ సీసం దిఅరస్స ణ సుందరం ఏఅం. 5-69

13. సా తుఇ సహత్థదిణ్ణం అజ్జవిరే సుహఅ గంధరహిఅంపి,
ఉవ్వసిఅ ణఅర ఘరదేవదేవ్వ ఓమాలిఅం వహఇ, 2-94

14. ఉఅ ణిచ్చల ణిప్పందా భిసిణీపత్తమ్మి రేహఇ బలాఆ,
ణిమ్మల మరగఅ భాఅణ పరిట్ఠిఆ సంఖసుత్తివ్వ, 1-4

15. సహిఈరసిప్పిఅ [illegible] గుప్ఫసు తి[illegible]వలిఅముహాఅందం,
ఏఅణ్ణ బాలవాలుంకి తంతుకుడిలాణ పేమ్మాణం, 1-10

ఎర్రగా. అబ్బే ఎంత మోసపోయాను. మామిడి మోస ఇది: నలికిరి కాదు ![16]

అబ్బ ! ఎంత హాయిగా వుందండీ ! ఊరి పొలిమేరకొక మఱ్ఱి చెట్టుంటే చాలు, ఊళ్ళో సత్పురుషుడు వున్నంత సంతోషంగా, శ్రీరామరక్షగా వుంటుంది. సత్పురుషుడు పోతే ఊరంతా పాడయినట్టు వుంటుంది. మఱ్ఱిచెట్టు కూలిపోయినా ఊరిపొలిమేరంతా బిక్కు బిక్కు మన్నట్టు వుంటుంది.[17] మఱ్ఱాకులమీద ఆ తెల్లటి గుర్తులేమిటి అసహ్యంగా కాకిరెట్టలా ? చెట్టంతా రెట్టలు వేసి వుంటాయా, ఏవరో సున్నమో, పిండో కలిపి చిలకరించి నట్లున్నారు, జనం ఆకులు కోసుకుపోగూడదనో ఇక్కడికి రాకూడదనో![18] మఱ్ఱి విత్తనం మహత్తు ఏముందో గాని, నలుసంత వుంటుంది గదా ! ఎక్కడ బతికేయూనరే, తక్కిన చెట్లేదైనా దానిని మించిపోతుందా ? అన్నీ దానికిందే కదా ![19]

మఱ్ఱివృక్షం ఎంత బాగుంటే ఏమి? రాత్రి ఎలా గడువుతాం? ఇక్కడ ఏదో దేవాలయంలా వుందే. అక్కడికో, మరెక్కడికో వెళ్ళి రాత్రికాస్తా విశ్రమిస్తే రేపటి సంగతి చూచుకుందాము. ఏమిటీ రొద? గోపురంలోని పావురాలు ! దేవాలయ గోపుర శిఖరం పడిపోయింది. దాని మేకు మాత్రం గోపురం నుంచి దూసుకురావడం,

---

16. దరఫుడిఅసిప్పినంవుడణిలుక్క హాలాహలగ్గ ఛేప్పణిహం,
పక్కంబట్ఠవిణిగ్గయ కోమల మంబంకురం ఉఅహ. 1-62

17. సుఅణో జం దేస మలంకరేఇ తం విఅ కరేఇ పవసంతో,
గామాసణుమ్మూలిఅ మహావడట్ఠాణ సారిచ్ఛం, 1-94

18. పహిఉల్లూరణ సంకాఉలాహిఁ అసఈహిఁ బహలతిమిరస్స,
ఆఅప్పణేణ ణిహులం వడస్స సిత్తాఇఁ పత్తాఇఁ. 2-66

19. ఏక్కేణవి వడబీఅంకురేణ సఅలవణరాఇమజ్ఝమ్మి,
తహ తేణ కఓ అప్పా జహ సేసదుమా తలే తస్స. 7-70

రొంద చూస్తే గోపురాన్ని కొరత వేసినట్టు లేదూ ![20] ఇక్కడ ఆ రొందలో ఉండలేమండి. ఏ ఇంటి అరుగు మీదనైనా పడుకొందాం. మన పల్లెవాసులు అతిథి సత్కార నిరతులు కదా! అంత మాత్రం ఆదరించరూ !

ఇంచుమించు ప్రతి ఇంటిచుట్టూ కంచె లున్నాయి. సందునుంచి వెలుపలికి వచ్చి మనలను పిలుస్తున్నట్టు లేదూ ఈ ఆముదపాకు ? పట్టేదేసి రొమ్ములు గలవారు ఇంట్లో వున్నారని సూచిస్తుంది సుమా ఈ ఆముదపాకు - అంటారేమో ! తప్పుకాదూ అలా భావించడం![21] కంచెల సందులలో నుంచి చూడండి ఎవరైనా కనిపిస్తారేమో ! అక్కడ కంచె అంత ఎత్తుగా లేదు. మీగాళ్ళెత్తి చూడండి; ఎవరైనా కనిపిస్తే పిలుద్దాం.[22] ఇంటి అరుగు మీద పడుకొని తొలి కోడి కూయగానే లేచిపోదాం.[23] పరుచు కొనేందుకు పక్కలు గూడానా? బాగుంది. ఇక్కడి ఆచారం ప్రకారం గడ్డిమోపు యిస్తారట. పరదేశం, ఏదో సర్దుకుందాం. గడ్డిపరచుకుని పైన అంగవస్త్రం వేసుకుని పడుకుంటే వెచ్చగానే ఉంటుంది. ఎందుకు, ఈ ఇంటి యిల్లాలు గడ్డిమోపు ఇవ్వడానికి కూడా సణుక్కుంటూంది? రోజూ

---

20. ఉఅరి దర దిట్ఠ థణ్ణుఅ ణిలుక్క పారావఆణ విరుఏహిం,
ణిత్థణఇ జాఅవేఅణం సూలాహిణ్ణంవ దేఉలం. 1-64

21. వఇ వివరణిగ్గఅదలో ఏరండో సాహఇ వ్వ తరుణాణం,
ఏత్థ ఘరే హలిఅవహూ ఏద్ధహామేత్తత్థణీ వసఇ. 3-57

22. ఏక్కేక్కభవఇవేఠణ వివరంతర దిణ్ణ తరల ణఅణాఏ,
తఇ వోలంతే బాలఅ పంజరసఉణాఇఅం తీఏ, 3-20
తా కిం కరేఉ జఇ తం సి తీఅ వఇవేట్ఠ పేల్లిఅథణీఏ,
పాఅంగుట్ఠద్ధక్ఖిత్తణీసహంగీఅ వి న దిట్ఠో. 3-21

23. తహ సోణ్హాఇ పులఇఓ దరవలిఅంతద్ధ తారఅం పహిఓ,
జహ వారిఓ వి ఘరసామిఏణ ఓలింగఏ వసిఓ. 3-54

వచ్చి పోయే వారు మన లాంటి వారు ఎందరో పాపం! విసుగుపడితే తప్పామరి? [24] అబ్బా! భరించలేమండీ పల్లెటూళ్లలో కుక్కల గోలను. కొత్తవారు కనిపించారా, ఒకే మొరుగుడు.[25]

లేవండయ్యా, లేవండి. కోడి కూస్తున్నది; ప్రయాణానికి తయారుకండి అని మనకు, మీ మీ పని చేసుకోండని ఇతరులకు చెబుతున్నట్టుంది. [26] ఏమిటి మిత్రమా! ఆ కోడి కూతకు అంత అదరిపడుతావు? వెనకటికి మా మిత్రుడొకడు పరగృహాలను మరగిన వాడు, కోడికూతతో చల్లగా ఇంటికి చేరుకొనేవాడు ఒకప్పుడు తన ఇంట్లో పండుకున్నప్పుడు కోడికూత విన్నా పరగృహం అనుకుని పయనం అయ్యేవాడట.[27] పదండి బయలుదేరుదాం. ఊరిబయటి కొలనిలో స్నానంచేసి వద్దాం. ఓహ్! నిశ్చలంగా చెరువు యెంత అందంగా ఉందండి! లోపల నీలాకాశం ప్రతి బింబిస్తూ ఉంటే ఆకాశాన్ని ఎవరో విసిరి కొలనిలో పడేశారా—అన్నట్టుగా వుంది. అంత పెద్ద ఆకాశం పడినా ఒక కమలం నలగలేదు; ఒక్క హంస యెగిరిపోలేదు.[28] అమ్మయ్యా! నీరు యెంత హాయిగా ఉందండీ. ఈదుదాం రండి. మహిళలుకూడా మజ్జనం చేస్తున్నారన్నమాట.

---

24. ఖండంతీఅ తణాఇం సోత్తుం దిణ్ణాఇఁ జాఇఁ పఇఅస్స,
తాఇం చ్చేఅ పహోఏ అజ్జా ఆఅట్టఇ రుఅంతీ 4-79

25. సుణఅ పఉరమ్మి గామే హిండంతీ తుహ కఏణ సా బాలా,
పాసఅ సారివ్వ ఘరం ఘరేణ కఇఆ వి ఖంజిహిఇ. 2-38

26. చోరాణఁ కాముఆణఁ అ పామరపహిఆణఁ కుక్కుడో రఅఇ,
రే రమహ వహహ వాహేహ ఏత్థ తణుఆఅఏ రఅణీ. 7-99

27. ణిఅఘరిణిఅం ఉవఊహస కుక్కుటసద్దేస ఝత్తి పడిబుద్ధ,
పర వసహి వాసపంకిర ణిఅఏ వి ఘరమ్మి మా భాసు, 6-8

28. కమలాఅరా ణ మలిఆ హంసా ఉడ్డావిఆ ణ అ పిఉచ్ఛా,
కేణావి గామతడాఏ అబ్భం ఉత్తాణిఅం పూఢం. 2-10

కొంచెం తప్పుకుని స్నానం చేద్దాం. పల్లెపడుచులు బాగా ఈత్తు న్నారు సుమా. అరె! అరె! మొసలా ఏమిటి? కాళ్లు లాగుతున్నది! అయ్యో! అయ్యో! ఆరి పిడుగా! మనిషివా? మొసలనుకున్నాను. ఎవరినో లాగబోయి, పొంపాటు చేశానంటావా? ఓహో ప్రియురా లినా ఏమిటి?[29] ఆవిడను చూచారూ! స్నానంచేసి నిలుచుంది కురుల నుండి జారేనీరు. ఇక తన్ను కట్టి ముడివేస్తారే అని కురులు కన్నీరు జాలువారుస్తున్నట్టు లేదూ![30]

కొలనినుంచి తిరిగి వచ్చేలోపుగానే ఏమిటి కోలాహలం? నిన్నటిలాగా మరేదైనా ఉత్సవమా? ఓహ్! అదాసంగతి? గ్రామణి గారి (గ్రామాధికారి) కుమార్తె పెండ్లట. సకుటుంబ సపరివార సమే తంగా రావాలని ఊళ్లో అందరికీ ఆహ్వానాలు వచ్చాయి. మనంకూడా నిన్న విశ్రమించిన ఇంటివారి పరివారంలోవారం అయాముగా మరి! వెళ్లుదాం పెండ్లి చూడడానికి.

ఈ గ్రామణిగారు మంచి పరాక్రమవంతుడు. ఈయనే కాదు, తాతముత్తాతలు అటు, ఇటు కుమారుడూ మొనగాళ్లేనట. అంతకు ముందు ఊళ్లో దొంగలు పడడం, గ్రామవాసులు భయంతో చెట్టు కొకరు, పుట్ట కొకరుగా పారిపోవడం, కొండల్లో, గుహల్లో తల దాచుకోవడం మామూలట. ఈయన పాలనలో అలాటి భయమేమీ లేదు. ఎవరూ అలా పరుగెత్తే ఊహ తలపెట్టడంలేదు[31] ఈయన తండ్రి మరణసమయంలో ఈయన్ను పిలిచి "నా పేరుతో నీవు సిగ్గు

---

29. పిసుణేంతి కామిణీణం జలలుక్క పిఆవఊహణ సుహేల్లిం,
కండఇఅ కఓలుప్ఫుల్లణిచ్చలచ్ఛీఇఁ వఅణాఇం, 6-58

30. వత్తణిఅంబప్ఫంసా ణ్హాణుత్తిణ్ణాఏఁ సామలంగీఏ,
జల బిందుఏహి చిహురా రుఅంతి బంధస్స వ భఏణ. 6-55

31. వింఝారుహణాలాసం పల్లీ మూకుణఉ గామణీ ససఇ.
పచ్ఛజ్జివిఓ జ కహావి సుణఇ తా జీవిఅం ముఅఇ. 7-31

పడకుండా ఉండేట్టు నడుచుకో" అని ఉపదేశించి మరణించాడట.[32] ఇక ఈయన కుమారుని సంగతి మరీ ముచ్చటైందట. కుర్రవాడైనా తండ్రికి చేదోడు వాదోడుగా ఉంటాడట. పరిజనులు, ప్రతిపక్షులూ విస్తుపోయేట్టు గ్రామరక్షణ చేస్తున్నాడట.[33] గ్రామణి పుత్రుడు మేటివిలుకాడు. పోరాటాలలో ప్రహారాలకు గాయాలు, గంట్లుపడ్డ ఆయన రొమ్ముపైన ఆయన భార్య సుఖంగా నిద్రించలేకపోయినా, పల్లెంతా హాయిగా గుండెమీద చేయివేసుకొని నిద్రపోతుందట.[34] ఇక నిష్ఠ అందామా! పరస్త్రీ పరాఙ్ముఖుడు. కనుక కులటలందరూ ఆయన్ను పరమ దుర్దర్శనుడని, నింబకీటం (చేదంటేనే తినే వేప పురుగు) వంటి వాడని, పెండ్లానికి భయపడతాడని, నిర్దయుడని నిందిస్తుంటారట.[35]

గ్రామణిగారిల్లు అందంగానే వుంది. ఇంటి ముందు గున్న మామిడి, పూచిందికూడా. మామిడి పూస్తే యిక నేముందీ, ఒంటరి గాళ్లకు అనర్థమే.[36] దొడ్లో పాదిరిచెట్టున్నట్టుందే! గుప్పుమంటున్నది వాసన. ఊడుగుమాను ఉంటే దయ్యాలు రావని నమ్మకం వీరందరికీని. ప్రతి ఇంట్లోను ఊడుగమాను వుండనే ఉంటుంది. అంకోటం

---

32. అప్పాహేఇ మరంతో పుత్తం పల్లీవఈ పయత్తేణ,
మహ ణామేణ జహ తుమం ణ లజ్జసే తహ కరేజ్జాసు. 7-32

33. జహ చింతేఇ పరిఅణో అసంకఇ జహ అ తస్సపరివక్ఖో.
బాలేణ వి గామణి ణందణేణ తహ రక్ఖిఆ పల్లీ. 7-28

34. పహార వణ ముగ్గ విసమే జాఆ కిచ్ఛేణ లహఇ సే ణిద్దం.
గామణి ఉత్తస్స ఉరే పల్లీ ఉణ సా సుహం సుహఇ. 1-31

35. ణిక్కిఅ జాఆభీరుఅ దుద్దంసణ ణిమ్బకీటసారిచ్ఛ.
గామో గామణిణందణ తుజ్ఝ కఏ తహవి తణుఆఇ.

36. ఖేమం కత్తో ఖేమం జో సో ఖుజ్జంబఓ ఘరద్దారే,
తస్సికిల మత్థఆఓ కోవి అణత్థో సముప్పణ్ణో. 5-99

(ఊడుగు) వాసన తెలివి తప్పినవారినికూడ బతికిస్తుంది.[37] పాదిరి పూల పసదనమే పసదనం. తల దిమ్మెక్కిపోతుంది.[38] అరె! అరె! ఎవరో అబ్బాయి పాదిరి చెట్టును యెక్కుతున్నట్టున్నాడు. పెద్ద చెట్టు; బోదెలు, కొమ్మలు చాలా యెత్తుగా వున్నాయి; పడిపోతాడు![39] ఈ పాదిరిపూల వాసనతో అసలు సంగతే మరచాము. పదండి పెండ్లింటిలోకి.

గ్రామణి పుత్రి మంచి అందగత్తె. సోగకన్నులు, సాగిపోతున్న చెన్నులు, వామనావతారంనుండి త్రివిక్రమావతారం యెత్తుతున్న రొమ్ములు.[40] మరి చూచినవారు రెప్పవాల్చరంటేనూ,[41] సౌందర్యాన్ని కథలుగా చెబుతుంటారంటేనూ తప్పా! పెళ్ళికూతురిని చేస్తున్నారా ఏమిటి? ఎటు చూచినా సుందరీ బృందమే. రత్నాలు విరజిమ్మినట్టు, పూలుకోసి వెదజల్లినట్టు లేదూ! ప్రకృతే

---

37 పుట్ఠిం పుససు కిసోఅరి పడోహరంకోల్ల పత్తచిత్తలిఅం,
ఛేఆహిఁ దిఅరజాఆహిఁ ఉజ్జుఏ మా కలిజ్జిహిసి. 4-13

మహమహఇ మలఅవాఓ అత్తా వారేఇ మం ఘరాణేంతీం,
అంకోల్ల పరిమలేణ వి జో క్ఖు మఓ సో మఓ వ్వేవ, 5-97

38. గామణి ఘరమ్మి అత్తా ఏక్కచ్చిఅ పాడలా ఇహగ్గామే,
బహుపాడలం చ సీసం దిఅరస్స ణ సుందరం ఏఅం. 5-69

39 ణిక్కండ దురారోహం పుత్తఅ మా పాడలిం సమారుహసు,
ఆరూఢణిపడిఅ కే ఇమీఅ ణ కఆ హాఆసాఏ, 5-68

40. పఢమం వామణ విహిణా పచ్ఛా హు కఓ విఅంభమాణేణ,
థణ జుఅలేణ ఇమీఏ మహుమహణేణ వ్వ బలిబంధో, 5-25

41. ఏక్కచ్చిఅ రూఅగుణం గామణిధూఆ సముచ్వహఇ,
అణిమిస ణఅణో సఅలో జీఏ దేవీకఓ గామో. 6-92

నవ్వుతున్నట్టు లేదూ! ముత్యాలహారాలవారు,[42] కంకణాలవారు,[43] పాంజీలవారు,[44] కర్ణాభరణాలవారు,[45] మణిమేఖలలవారు.[46] చెవాకు కూడా కొందరు పెట్టుకున్నట్టున్నారే. పాపం ! బంగారు కమ్మలు పెట్టుకున్న చెవుల్లో తాటి కమ్మలు![47] పట్టుచీరెలవారు, నల్లచీరెల వారు, నవరంగకం-కుసుమపూవు రంగు చీరెలవారు, రక్తదుకులాల

---

42. ఖుప్పఇ హారో థణమండలాహి తరుణీఅ రమణ పరిరంభే,
అచ్చిఅగుణా వి గుణిణో లహంతి లహుఅత్తణం కాలే. 5-28

43. పాణిగ్గహణే వ్విఅ పవ్వఈఏ ణాఅం సహీహి సోహగ్గం,
పసుపఇణా వాసుఇకంకణమ్మి ఓసారిఏ దూరం. 1-69

సఅణే చింతామఇఅం కాఊణ పిఅం ణిమీలిఅచ్ఛీఏ,
అప్పాణో ఉఅఊఢో పసిఢిలవలఆహి బాహాహిం. 2-35

జో వి ణ అణాఇ తస్స వి కహేఇ భగ్గాఇ తేణ వలఆఇ,
అఇఉజ్జుఆ వరాఈ అహ వ పిఓ సే హఆసాఏ, 5-88

అఇకోవణా వి సాసూ రుఆవిఆ గఅవఈఅ సోణ్హాఏ,
పాఅపడణోణ్ణఆఏ దోసు వి గలిఏసు వలఏసు. 5-93

44. ణేఉర కోడి విలగ్గం చిఉరం దఇఅస్స పాఅ పడిఅస్స,
హిఅఅం పఉత్థమాణం ఉమ్మోఅంతీ వ్విఅ కహేఇ, 2-88

45. రేహాఇ గలంత కేసక్ఖలంతకుండల లలంత హారలఆ,
అద్ధుప్పఇఆ విజ్జాహరి వ్వ పురుసాఇరీ బాలా. 5-46

46. మసిణం చంకమ్మంతీ పఏపఏ కుణఇ కీస ముహభంగం,
ణూణం సే మేహలిఆ జహణగఅం ఛివఇ ణహపంతిం. 5-63

రుంటారవిందమందిర మఅరందాణంది ఆలిరించోలీ,
ఝణఝణఇ కసణ మణిమేహల వ్వ మహుమాసలచ్ఛీఏ. 6-74

47. పరిరద్ధ కణఅ కుండల గండత్థలమణహరేసు సవణేసు,
అణ్ణఅసమఅవసేణ అ పహిరజ్జఇ తాలవేంటజుఅం. 4-98

వారు, భేష్ ![48] ఎవరావిడ! వనలక్ష్మిలా నెమలి పింఛం కొప్పులో తురుముకొన్న నెరజాణ? భిల్లవనితలా వుందే; మెడలో పద్మ రాగాల మాలికలాగ గురువింద దండ! ఈమె ముందు ముత్యాల పేర్లు వేసుకున్న వారంతా దిగదుడుపు సుమా ![49] ఎవరండీ రైతు పడుచు! కుసుమపూవు రంగు చీర కట్టుకుని మురిసిపోతూ, వీథంతా తనే అయినట్టు నడుస్తూ వస్తున్నది! లేక లేక తెచ్చి ఇచ్చాడు కాబోలు భర్త ఈ చీరను.[50]

ఏమిటమ్మా పెండ్లికూతురుని అలా బోసిమెడతో కూచో పెట్టారు? సంబరంలో ఏమీ తోచలేదు కాబోలు! ఆ పచ్చలకంఠె వేయించండి.[51] పాపటదిద్ది రేగిన జుట్టును దువ్వెనతో అలా అనండి.

---

48 ణీలపడపాఉఅంగి త్తి మా హసు ణం పరిహరిజ్జాసు,
పట్టంసుఅం పి ణద్ధం రఅమ్మి అవణిజ్జఇ చ్చేఅ. 6-20

సంఝా రాఓత్థఇఓ దీసఇ గఅణమ్మి పడివఆచందో,
రత్తదుకూలంతరిఓ థణణహా లేహో వ్వ ణవవహూఏ. 6-39

ఉహ సంభమ విక్ఖిత్తం రమిఅవ్వఅ లేహాలాఏ అసఈఏ,
ణవరంగఅం కుడంగే ధఅం వ దిణ్ణం అవిణఅస్స. 5-21

49. సిహిపేహుణావఅంసా వహుఆ వాహస్స గవ్విరీ భమఇ,
గఅమోత్తిఅరఇఅ పసాహణాణం మజ్ఝే సవత్తీణం. 2-73

ణ గుణేణ హీరఇ జణో హీరఇ జో జేణ భావిఓ తేణ,
మోత్తూణ పులిందా మోత్తిఆఇఁ గుంజాఓఁ గేణ్హంతి. 4-10

50. అప్పత్త పత్తఅం పావిఊణ ణవరంగఅం హాలిఅ సోణ్హా,
ఉఅహ తణుఈ ణ మాఅఇ రుందాసు వి గామ రచ్ఛాసు. 3-41

51. ఉఅ పోమ్మరాఅ మరగఅ సంవలిఅ రహాఅలాఓ ఓఅరఇ,
ణహసిరి కంఠబ్భట్ఠ వ్వ కంఠిఆ కీరరింఛోలీ. 1-75

ఏమీ దువ్వేనండీ పుల్లతో మురికి తీసివేయండి త్వరగా.[52] ముఖంలో తిలకం చెరిగిపోతే యేమి బాగుంటుంది? తిలకం బాగా దిద్దించండి.[53] పసపాడించారు. కాళ్ళకు పారాణి పూశారు.[54] కాటుక పెట్టారు. బాగుంది. కొప్పులో పూలు ముడిచారు. స్నానసుగంధిలమైన చికుర భారం పూలను పుమ్మి వేసినట్టు వుంది; మరీ బాగుంది.[55] కాని కంచుకం లేకపోవడం యేమీ బాగాలేదు. ఈ శుభదినాననైనా కంచుకం తొడిగించండి, ఎఱ్ఱదో! నల్లదో! కుసుమపూవు రంగుదో! నల్లనైకే తొడిగించండి; మేఘాల్లోని అందం వస్తుంది మిట్టలకు.[56] చందనచర్చ చెడదులెండి.[57] ముత్యాల హారాలు యమునా తరంగాలపై దొర్లే నురుగులాగ అందమిస్తాయి కూడాను.[58] కట్టిన పట్టుచీర

---

52. మజ్ఝే పఅణుఅ పంకం అపహోవాసేసు సాణచిక్ఖిల్లం,
గామస్స సీస సీమంతఅం వ రచ్ఛాముహం జాఅం. 7-82

ణ్హాణ హలిద్దాభరిఅంతరాఇఁ జాలాఇఁ జాలవలఅస్స,
సోహంతి కిలించిఅకంటపణ కం కాహిసీ కఅత్థం. 1-80

53. తీఅ ముహాహిం తుహ ముహం తుజ్ఝ ముహాఓ అ మజ్ఝ చలణమ్మి,
హత్థాహత్థీఅ గఓ అఇదుక్కరఆరఓ తిలఓ. 2-79

అహాఅం లజ్జాలుఇణీ తస్స అ ఉమ్మచ్ఛరాఇఁ పేమ్మాఇం,
సహి ఆఅణో వి ణిఉణో అలాహి కిం పాఅరాఏణ. 2-27

ణ్హాణస్స ఉరే పఇణో ఠవేఇ గిమ్హావరణ్హ రమిఅస్స,
ఓలం గలంతకుసుమం ణ్హాణసుఅంధం చిఉరభారం. 3-99

56. అజ్జాఇ ణీలకంచుఅ భరిఉవ్వరిఅం విహాఇ థణవట్టం,
జలభరిఅ జలహరంతరదరుగ్గఅం చందబింబం వ్వ. 4-95

57. తావ మవణేఇ ణ తహా చందణపంకో వి కామి మిహుణాణం,
జహ దూసహేవి గమ్హే అణ్ణోణ్ణాలింగణ సుహేల్లీ. 3-88

58. మగ్గం చ్చిఅ అలహంతో హారో పీణుణ్ణఆణ థణఆణం,
ఉవ్విగ్గో భమఇ ఉరే జముణాణఇఫేణ పుంజో వ్వ. 7-[illegible]

జారిపోకుండా పోకముడి గట్టిగా బిగించండి.[59] బంగారు మొలనూలు మాత్రం మాంచి అదృష్టం చేసుకుంది లెండి. మరి మొదట ఆ నిప్పులో పడి ఆ తర్వాత నీరులో మునకవేసి శ్యామశబల వ్రతం చేసింది కదా, అంతమాత్రం సుందరస్థానం పొందవద్దూ మరి?[60] మరచాను. పెండ్లి కూతురు నగల వర్ణికలు- నమూనాలు బాగున్నాయి![61] ఏ బత్తుణితో చేయించారో? బంగారులో కల్తీ లేదు కదా! వరపెట్టి చూపించారా![62] రత్నాలన్నీ పరీక్షచేయించుకున్నారా?[63]

ఏమండీ పూలమాలలేవీ? మొదటే జాగ్రతపడవద్దూ! ఏమిటి గోల వెలుపల? ఓ! మాలాకారి! అయితే మంచి సమయానికే వచ్చింది. వెళ్ళి పూలమాలలు తెండి. మాలాకారి మంచి జాణ! పూలిచ్చే సాకుతో భుజాలు ఎత్తుతూ తమాషాలుచేస్తూ కోడెగాళ్ళను ఆకర్షిస్తున్నది.[64] ఏమిటి తమ్ముడూ! పూలబేరంసాకుతో ఎక్కడ

---

59 జాఓ సో వి విలక్ఖో మఏ వి హసిఊణ గాఢ ముపగూఢో,
పఢమోసరిఅస్స ణిఅంసణస్స గంఠిం విమగ్గంతో. 4-51
అలిఅపసుత్తవలంతమ్మి ణవవరే ణవవహూఅ వేవంతో,
సంవేల్లిఓరు సంజమిఅ వత్థగంఠిం గఓ హత్థో. 7-46

60. ఇఅరో జణో ణ పావఇ తుహ జఘణారుహణ సంగమసుహేల్లిం,
అణుహవఇ కణఅదోరో హుఅవహ వరుణాణ మాహప్పం. 3-11
దీహుణ్హపఉరణీసాసపఆవిఓ( వాహసలిల పరిసిత్తో,
సాహేఇ సామసవలం వ తీఏ అహరో తుహ విఓఏ. 2-85

61. దోలంగులలకవాలఅపిణద్ధ సవిసేసణీలకంచుఇఆ,
దావేఇ థణత్థలవణ్ణిఅం వ తరుణీ జువజణాణం, 7-20

62. వాఉలిఅపరిసోసణ కుడంగపత్తలణ సులహసంకేఅ,
సోహగ్గకణఅకసవట్ట గిమ్హ మా కహ వి ఝింజిహిసి. 7-26

63. దుస్సిక్ఖిఅ రఅణపరిక్ఖఏహిం ఘిట్టోసి పత్థరే తావ,
జా తిలమేత్తం వట్టసి మరగఅ కా తుజ్ఝ ముల్లకహా. 7-27

64. మాలారీ లలిఉల్లులిఅబాహుమూలేహిం తరుణహిఅఅఇం,
ఉల్లూరఇ సజ్జుల్లూరిఆణ( కుసుమాఇం( దావేంతీ 6-96

చూస్తున్నావు? మాలాకారి బాహుమూలాలనా? ఛా![65] గృహ ద్వారతోరణం పైవున్న ఆ ఎండిపోయిన వందనమాలను తీసివేసి కొత్తది వేయిద్దురూ![66] ద్వారంలో మంగళ కలశాలు కూడా పెట్టండి బాబూ! పెండ్లి సంబరంలో సర్వసాధారణమైన ఆచారాలు మరిస్తే ఎట్లా?[67]

ఇక పెండ్లికూతురికి పెండ్లికడేలు (అవిధవాలక్షణ వలయాలు) తొడిగించండి.[68] పూజా కలశంలో తామరపూలు వేయండి.[69] మంగళగాయికల మంగళగీతాలాపాలు కానివ్వండి. మంగళగీతంలో తన భావిపతి పేరు, వంశం శ్రద్ధగా వింటున్న పెండ్లికూతురు ఒళ్ళు పులకరించి పోతున్నది చూచారా?[70] పెండ్లికూతురు మనసు హృదయ ఫలకం మీద ఆశ అనే బలపంతో ఏమేమి తియ్యని కలలు వ్రాసుకుంటున్నదో?[71] మంగళవాద్యాలు వాయించడయ్యా. ఇట

---

65. మాలారీఏ వేల్లహలబాహుమూలావలోఅణ సఅణ్హో,
అలిఅం పి భమఇ కుసుమగ్ఘపుచ్ఛిరో పంసులఇ అణో. 6-98

66. సా తుహ కఏణ బాలఅ అణిసం ఘరదారతోరణ ణిసణ్ణా,
ఓససఈ వందనమాలిఅ వ్వ దిఅహం విఅ వరాఈ. 8-62

67. రత్థా పఇణ్ణణఅణుప్పలా తుమం సా పడిచ్ఛఏ ఏంతం,
దారణిహిఏహిఁ దోహిఁ వి మంగలకలసేహిఁ వ థణేహిం. 2-4(

68. అవిహవలక్ఖణవలఅం తాణం ణేంతో పుణోపుణో గలిఅం,
సహిసత్థో చ్చిఅ మాణంసిణీఅ వలఅరఓ జాఓ. 6-89

69. కం తుంగథణుక్ఖిత్తేణ పుత్తి ధారట్ఠిఆ పలోఏసి,
ఉణ్ణామిఅ కలసణివేసిఅగ్ఘతేణ వ ముహేణ. 8-56

70. గిజ్జంతే మంగళగాఇఆహిఁ వరగోత్తదిణ్ణఅణ్ణాఏ,
సోఉం వ ణిగ్గఓ ఉఅహ హోంతవహుఆఇ రోమంచో. 7-42
మణ్ణే ఆఅణ్ణంతా ఆసణ్ణవిఆహ మంగళుగ్గాఇం,
తేహిఁ జుఆణేహిఁ సమం హసంతి మం వేఅసకుడంగా. 7-48

71. జం జం అలిహఇ మణో ఆసావట్టీహిఁ హిఅఅ ఫలఅమ్మి,
తం తం బాలో వ్వ విహీ ణిహుఅం హసిఊణ పమ్హుసఇ. 7-58

హాం - తప్పెట వాయించండి.[72] గ్రామణిగారి గొప్పకు తగినట్టు ఏనుగుపై నగారావేసికూడా వాయిస్తున్నారూ! బాగుంది. ఏనుగుతో పెళ్ళిపందిరి మరీ నిండుగా వుంది లెండి.[73]

పెండ్లిసందడిలో భోజనం సంగతి చూచేవాళ్ళున్నారా లేదా? మహానసం వైపు వెళ్ళివద్దాం రండి. వంటలు మహాజోరుగా సాగుతున్నాయండోయ్. పిండి దంచుతున్నది ఒకామె. అరిసెలకా ఏమిటి? పిండి ఒళ్ళంతాపడి క్షీరసముద్రంనుంచి పుడుతున్న లక్ష్మిలా వున్నావమ్మా, మహా అందంగా![74] లడ్లు కూడ కడుతున్నట్లున్నారు.[75] మోదకాలు కూడానా! పూర్ణంవా? పిండివా? అందుకేనేమిటి శెనగలు వేయించి చేటలో పోశారు! చేట కాలిపోయేని దూరంగా పెట్టండి.[76] ఏమమ్మా వంట మసంతా నీ మొఖానికే పూసుకున్నట్టున్నావే? మసి పూసుకున్నా నీ ముఖానికేం కుందు కలుగలేదులే! అయినా నవ్వుతారు తుడుచుకోందూ![77] ఎందుకండీ అలా ఊదుతున్నారు పొయ్యిని మీరు? ఊదిన కొద్ది మీకు దగ్గరగా ఉందామని

---

72. అణత్తం తేణ తుమం పఇణో పహాఏణ పడహాసద్దేణ,
మల్లి ణ లజ్జసి ణచ్చసి దోహగ్గే పాఅడిజ్జంతే. 7-85

73. ధూళిమయిలో వి పంకంకిఓ వి తణరఇఅ దేహభరణో వి,
తహ వి గఇందో గరుఅత్తణేణ ఢక్కం సమువ్వహఇ. 7-26

74. పేచ్ఛంతి అణిమిసచ్ఛా పహిఆ హలిఅస్స పిట్ఠపండురిఅం,
ధూఅం దుద్ధసముద్ధుత్తరంతలచ్ఛిం విఅ సఅణ్హా. 4-88

75. కమలం ముఅంత మహుఅర పక్కకఇత్థాణం గంధలోహేణ,
ఆలేక్ఖ లడ్డుఅం పామరో వ్వ ఛివిఊణ జాణిహిసి. 7-41

76. సుప్పం డడ్ఢం చణఆ ణ భజ్జిఆ సో జుఆ అఇక్కంతో,
అత్తా వి ఘరే కువిఆ భూఆణ వ వాఇఓ వంసో. 6-57

77. ఘరిణీఏ మహాణస కమ్మలగ్గమసి మలిఇఏణ హత్తేణ,
ఛిత్తం ముహం హసిజ్జఇ చందావత్థం గఅం పఇణా. 1-18

కాబోలు నిప్పుమండనే మండడం లేదు.[78] ఆవిడను చూడండి మరీ ఇదిగా ఉంది. పిండి దంచిందా. ఆ పిండి రొమ్ములపై పడిందా. తామర పూవువద్ద వున్న హంసల్లా లేవూ ?[79] ఆ సందులు (ముక్కాలి పీటలు) ఒక దానిపై ఒకటి ఉచ్ఛ్రాపచంగా పెట్టి ఏమిటి అందుకుంటు న్నారు ?[80] పాలచట్టినా ! అయితే దించుకొని దీనిలో పోయనా ? దిగేప్పుడు పడిపోయేరు ! ఇంతకూ పాలల్లో పాలు కలిపితే ఏమి తెలుస్తుంది, నీళ్ళు కలిపినా తెలియనప్పుడు? [81] చట్టువంతో అన్నం కలియబెట్టండి. వార్చా ? అత్తెసరా ?[82] కాకులొచ్చి కలుషితం చేసేను, తోలండి, తోలండి.

వంటలెప్పుడవుతాయో ! ఆకలవుతున్నది ఆ వేయించిన సెనగలిలా ఇవ్వండి. నమిలి మంచినీళ్లు తాగుతాను. ఇదేమిటి ! మంచినీళ్ళు యివ్వమంటే కాగి చల్లారిన నీరిచ్చారు. జ్వరం తగిలిన వానికి ఇచ్చినట్లు : కాగి చల్లారిన నీటిలో రుచా పచా ![83] స్వప్నంలో

78. రంధణ కమ్మణిఉణిఏ మా జూరసు ర త్తపాడలసుఅంధం,
ముహ మారుఅం పిఅంతో ధూమాఇ సిహీ ణ పజ్జలఇ. 1-14

79. ముహ పుండరీఅ ఛాఆఇ నంఠిఆ ఉఅహ రాఅహంసే వ్వ,
ఛణపిట్ఠ కుట్టణుచ్ఛలిఅ ధూలి ధవలే థణే వహఇ. 7-2

80. కహం తంపి తుఇ ణ ణాఅం జహ సా ఆసందిఆణబహులఅణం,
కాఊణ ఉచ్చవచిఅం తుహ దంసణ లేహలా పడిఆ. 7-97

81. గమ్మిహిసి తస్సపాసం సుందరి మా తురఅ పడ్డఉ మిఅంకో,
దుద్ధే దుద్ధం మిఅ చందిఆఇ కో పేచ్ఛఇ ముహం దే. 7-7

82. ఛిచ్చాఅరోఃవేచ్ఛఇ ణాహిమండలం సావి తస్స ముహఅందం,
తం చటుఅం అ కరంకం దోహ్ణా వి కాఆ విలుంపంతి. 2-62

83. వేమ్మస్స విరోహిఅ సంధిఅస్స పచ్చక్ఖ దిట్టవిలిఅస్స,
ఉఅఅస్స వ తావిఅసీఅలస్స విరసో రసో హోఇ 1-53

తాగిన నీటిలాగా,[84] చిత్రంలో చూసిన లడ్డు లాగా[85] దాహం తీరుతుందా ? ఆశ తీరుతుందా !

పెళ్ళిపందిరిలో పిల్లల అల్లరికూడా సరదాగానే వుంది. ఎందుకా పెద్దమనిషిని అందరూ ఏడిపిస్తున్నారు? పాపం ! ధార్మికుడిలా వున్నాడు. ప్రాచీన సంప్రదాయంతో తమంత తాము వుండే వారంటే-ధార్మికులంటే-ఎందుకో కుర్రకారుకు గిట్టదు. ఎందుకలా ఏడిపిస్తున్నారు-ఆయనను ? చిలక కొరికిన మామిడిపిండెను కోసుకుంటున్నాడు మీగాళ్ళెత్తి.[86] ఏమిటి ధార్మికయ్యగారూ మీగాళ్ళెత్తారు. మామిడికాయకాయ కోసుకుంటూ అలాగే స్వర్గానికి లేచిపోతారా?-అని అందరూ కేరింతలు. మొన్న మరొక ధార్మికుడు గోదావరి గట్టున కానుగకొమ్మ విరుచుకొంటుంటే ఒకావిడ అల్లే ఎత్తిపొడిచిందట.[87] పిల్లికి గంజినీరు పెట్టాడు ఆ కుర్రాడు. పిల్లి పాలనుకుంటుందా ? మోసపోతుందా ?[88] కోతికి ఆవాకు తినిపించారా ? ఒకే గోలచేస్తున్నది; పొట్ట బాదుకుంటున్నది.[89] ఆ

---

84. అవిఅణ్ణ పేక్ఖణిజ్జేణ తక్ఖణం మామి తేన దిట్ఠేణ,
సివిణఅపిఏణ వ పాణిఏణ తణ్హా వ్విఅ ణ ఫిట్టా. 1–98

85. కమలం ముఅంత మహుఅర పక్కకఇత్థాణం గంధలోహేణ,
అలేక్ఖ లడ్డుఅం పామరోవ్వ ఛివిఊణ జాణిహిసి. 7–41

86. చంచుపుడాహఅ విఅవిఅ సహాఅరరసేణ పిత్తదేహస్స,
కీరస్స మగ్గలగ్గం గంధంధం భమఇ భమరఉలం. 7–66

87, భంజంతస్సవి తుహ సగ్గగామిణో ణఇకరంజ సాహోఓ,
సాఆ అజ్జ వి ధమ్మిఅ తుహ కహాంధరణిం విహ ఛివంతి. 2–67

88. ణ వినా సబ్భావేణ ఘేప్పఇ పరమత్థ జాణుఓ లోఓ,
కో జుణ్ణమంజరం కంజిఏణ వేలరిఉం తరఇ. 8–88

89 గోలాణఇఏ కచ్ఛే చక్ఖంతో రాఇఆఇ పత్తాఇం,
ఉప్పడఇ మక్కడో ఖోక్ఖఏఇ పోట్టం అ పిట్టేఇ. 2–71

రెండవ కోతి నేరెడుపండిచ్చినా తినదేం? ఒకసారి తుమ్మెద కుట్టిం దట. అప్పటినుండి నేరేడుపండంటే తుమ్మెద అని భ్రమపడుతున్న దట.[90] ఆ మూడో కోతి సంగతేమిటి? దూలగొండాకు తాకించారా తెగ బరుక్కుంటున్నది. ఒళ్ళంతా? దూలగొండి ఆకు అనుకొని[91] పెంటికోతి చేయి తాకనంటూంది.

నాగవల్లి (చతుర్థీ మంగళం) చేసుకుని అల్లుడు వెళ్ళుతున్న ట్టున్నాడు.[92] ప్రస్థాన కలశం పెట్టించండి.[93] సామాను సర్దు తున్నారా? ఒకే ఎద్దుపై అంతగా బరువు వేయకండయ్యా. బరు వుకు కుసిపడిపోతుంది.[94] రండి రండి, ఊరి పొలిమేరవరకు సాగ నంపివద్దాం పెళ్ళివారిని.[95] మనమూ వెళ్ళుదాం.

పెండ్లి సందడిలో కనిపించలేదు గాని. ఏమి ఎండలు! ఏమి ఎండలు! భరించలేమండి. ఎండకాలము వచ్చింది గదా, యెండలు కాక మంచు కురుస్తుందా అంటారేమో! అయినా ఇంతటి ఎండలా? నిప్పులు చెరిగేస్తున్నవి. చెట్ల నీడకూడ యెండ భయానికి చెట్టు దాటి

---

90. ఓసరఇ ధుణఇ సాహం ఖోక్ఖాముహాలో పుణో సముల్లిహఇ,
జంబూఫలంణ గేణ్హఇ భమరో త్తి కఈ పఢమ డక్కో. 6-81

91. ణ ఛివఇ హత్థేణ కఈ కండూఇఅభఏణ పత్తలనిఉంజే,
దరలంబిఅ గోచ్ఛ కఇకచ్ఛు సచ్ఛహం వాణరీహత్థం. 6-82

92. ఉఅగఅ చఉత్థిమంగలహోంత విఓఅ సవిసేసలగ్గేహిం,
తిఅ వరస్స అ సేలంసుఏహిః రుణ్ణం వ హత్థేహిం, 7-44

93. హరిహిఇ పిఅస్స నవచూఅపల్లవో పఢమమంజరి సణాహో,
మా రువసు పుత్తి పత్థాణకలసముహసంఠిఓ గమణం. 2-48

94. ఉజ్జుసి పిఅఇ సమఅం తహా విహురే భణసి కీస కిసిఅం త్తి,
ఉవరి భరేణ అ అణ్ణుఅ ముఅఇ బఇల్లో వి అంగాఇం. 3-75

95' అచ్ఛఉ దావ మణహరం పిఅఇ ముహదంసనం అఇ మహగ్ఘం,
తగ్గామచ్ఛేత్తసీమా వి ఝత్తి దిట్ఠా సుహావేఇ. 2-63

రాదన్నట్టు వుంది.[96] చెట్లలోని కీచురాళ్ళు గీపెడుతూంటే, చెట్లు యెండభయానికి ఏడుస్తున్నట్లు అనిపిస్తుంది.[97] ఈ యెండ సంగతి తెలిక ఊరు కదిలాము. అబ్బ అదేమిటి? దూరంగా నిప్పంటు కున్నట్టుందే? ఔనండీ అవి కొండమీది అడవులు. ఎండకు దావాగ్ని పుట్టి కాలిపోతున్నాయి.[98] అడవిలో ఎండ తాపానికి జంతువులు కూడా వివశులేకుండా పడిపోతున్నాయే! ఎనుబోతు నల్లత్రాచు పామును సెలయేటి నీటిజాలని నాకబోతున్నది అదేమో యెను బోతు చొంగను నల్లరాతి దొణ నుంచి వచ్చేనీరని నాకబోతున్నది.[99] వడదెబ్బకు అలసి సొలసిన యేనుగైతే కొండపాము కుబుసాన్ని సెలయేటి నీటి చార అనే భ్రాంతితో తొండం తడుపుకుంటున్నది.[100] అమాయకమైన జింకలు అడవిలో నిప్పంటుకున్నా పూచిన మోదుగ లనుకొని కదలడం లేదు.[101] మామిడి తోటలు నిప్పుమంటలాగా కనిపిస్తున్నాయి. అవేమిటి పొగలా! అబ్బే! తుమ్మెదలండీ.[102]

---

96. ఢోలం పి ణ దీసరఈ మజ్ఝణ్ణే ఉహ సరీర తలలుక్కా,
ఆఅవభఏణ ఛాఈ వి పహిఅ తాకిం ణ వీసమసి. 1-49

97. రోవంతివ్వ ణరణ్ణే దూసహ రఇకిరణఫంస సంతత్తా,
అయితార ఝిల్లి విరుఏహిఁ పాఅవా గిమ్హమజ్ఝణ్హే. 5-94

98. గిమ్హే దవగ్గి మసి మఇలిఆఇఁ దీసంతి విజ్ఝసిహరాఇం,
ఆసము పఉత్థవఇఏ ణహోంతి ణవపాఉసబ్భాఇం. 1-78

95. గిరిసోత్తో త్తి భుఅంగం మహిసో జీహాఇ లిహఇ సంతత్తో,
మహిసస్స కణ్హపత్థర ఝరో త్తి సప్పో పిఅఇ లాలం. 6-51

100. ఉఅ ఓల్లిజ్జఇ మోహా భుఅంగకిత్తీఅ కడఅలగ్గా,
ఓజ్ఝర ధారా సద్ధాలుఏణ సీసం వణ×ఏణ. 7-40

101. తమ్మిర వసరిఅ వాలుఅః హా జాలాలి పలీవిఅ వణావాోఏ,
కింసువణంతి కవిఊణ మద్ధహారిణో ణ ణిక్కమఇ. 6-88

102. అంబవణే భమర ఉలం ణ వినా కజ్జేణ ఊసుఅం భమఇ
కత్తో జలణేణ వినా ధూమస్స సిహా ఉదీసంతి. 6-48

చిన్న చెరువులు, మడవలు ఎండి పోయాయి.[103] దూరంలో కుండలక పిల (రహట్టం) కనిపిస్తున్నది. అక్కడికి వెళ్ళి యినా చుక్క మంచినీళ్ళు తాగుదాం. నోరెండి పోతున్నది. కుండల కపిలను చూస్తే దుష్టులు జ్ఞాపకం వస్తారు. నీళ్లు ముంచుకుని నీలుగుతూ వస్తాయి. దుష్టులు తమ అవసరం వచ్చినప్పుడు వినయంగా వెళ్ళుతారు. పని తీరిన తర్వాత పెడమొగం పెట్టుకొని వస్తారు.[104]

బాబూ! ఇది వట్టి దరిద్రగ్రామం. వట్టి మొప్పెపల్లెలా వుంది.[105] ఎవరితో మాట్లాడం! ఎవరితో తమాషా చేయం! గ్రామణిగారేమో మరీమొప్పె. పొట్టపొడిస్తే అక్షరం లేదు. సిద్ధిరస్తు అనికూడా వ్రాయలేదు.[106] గ్రామణి పుత్రి అట వట్టి విషపు తీగెట.[107] ఆమెను గురించి రకరకాలుగా చెప్పుకుంటారు. గ్రామణిగారికి మంచి చెరకు తోటలున్నాయి. గాను గాడిస్తాడు. ఏం లాభం? ఇంట్లో ఉప్పునేయి కూడా లేని అన్నం.[108] సరకం (చెరకుసారా)

---

103. వాఉలిఆపరిసోసణ కుడంగపత్తలణ సులహ సంకేఅ,
సోహగ్గకణఅకసవట్ట గిమ్హ మా కహ వి ఝింజిహిసి. 7-26

104. ఉఅఅం అహిఉణ ఉత్తణిఅణణా హోంతి కేవి సవిసేసం,
రిత్తా ణమంతి సుఇరం రహట్టఘడిఅ వ్వ కాపురిసా. 5-90

105. వక్కం కో పులఇజ్జఉ కస్స కహిజ్జఉ సుహంవ దుక్ఖంవా,
కేణసమం వ హాసిజ్జఉ పామరపఉరే హఅగ్గామే. 2-64

106. చిరడం వి అఆణంతో లోఅ లోఏహిం గోరవబ్భహిఆ,
సోణారతులే వ్వ ణిరక్ఖరా వి ఖందేహి ఉబ్భంతి. 2-91

107. పత్తాఇచ్చిఅ మోహం జణేఇ బాలత్తణే వి పట్టంతి,
గామణిధూఆ విసకందలివ్వ వడ్డిఆ కాహిఇ అణత్థం. 5-10

108. భుంజసు జం సాహీణం కుత్తో లోణం కుగామ రిద్ధమ్మి,
సుహఆ సలోణేణ వి కిం తేణ సిణేహో జహిం ణత్థి. 4-16

తీయించి అమ్ముకుని డబ్బు చేసుకుంటాడు.[109] ఇక్కడ అందరూ తాగుబోతుల్లాగే ఉన్నారు-ఆడా, మగా అందరూను.[110] గ్రామణి ఇంటికి ఎవరైనా వెళ్ళితే స్నానానికి నీళ్ళు కూడా దొరకవు. వేరేదు పట్టపాడియిచ్చి గోదావరికి వెళ్ళి వ నగిరమ్మంటాడు.[111] దొడ్లో మామిడి చెట్టు. పిల్లవాడు ఏడ్చినా ఒక్క పండు ముక్క ఇవ్వడు.[112] నిధులు దొరికాయట. రాజుకు తెలియపరచకనే స్వాహా చేశాడు. పాములాగ దానికి కాపలావుంటాడు.[113] పిల్లికి బిచ్చం పెట్టడు. అంత డబ్బుండి ఏమి ప్రయోజనం, మండే ఎండలో వెళ్ళేవాణి నీడలాగ![114] దొడ్లో గొడ్డుగోదా చూద్దామా! మాంచివే వున్నాయి. అయినా వట్టిపోయిన ఆవును కూడా పితుకుతాడు. ఏబ్రాసి. మంచి గుడ్డలైనా కడతాడా అంటే అదీలేదు. పిడకల పొగచూరిన పాతగుడ్డలు కట్టుకుంటాడు.[115] అయినా అధికారి కాదూ! ఊరివారికంతా

---

109. అరుహఇ జుణ్ణఅం ఖుజ్జఅం వి జం ఉఅహ వల్లరీ తడుసీ,
ణీలుప్పల పరిమలవాసిఅస్స సరఅస్స సో దోసో. 6-84

110. సకఅగ్గహ రహసుత్తాణిఅణణా విఅఇ పిఅముహ విఇణ్ణం,
థోఅం థోఅం రోసోసహం వ ఉఅ మాణిణీ మఇరం. 6-50

111. తుజ్ఝంగరాఅ సేసేణ సామలీ తహ ఖరేణ సోమారా,
సా కిర గోలా ఊలే ణ్హాఆ జంబూకసావణ. 2-89

112. విసమట్ఠిఅ పక్కేక్కంబ దంసణే తుజ్ఝ సత్తుమాణిప,
కో కో ణ పత్థిఓ పహిఅణం డింభేరుఅంతమ్మి. 6-15

113. చోరా సభఅ సతణ్హం పుణోపుణో పేసఅంతి దిట్ఠీఓ.
అహిరక్ఖిఅ ణిహికలసే వ్వ పోఢవఇఆ థణుచ్ఛంగే. 6-76

114. హొంతీ వి ణిప్ఫలచ్చిఅ ధణద్ధిహోఇ కివిణపురిసస్స,
గిహ్మాఅవ సంతత్తస్స ణీఅఅ ఛాహి వ్వ పహిఅస్స. 2-6

115. సూఇజ్జఇ హేమంతమ్మి దుగ్గఓ పుప్ఫఆ సుఅంధేణ,
ధూమ కవిలేణ పరివిరళతంతుణా జుణ్ణవడఏణ. 4-29

భయమే. రాజద్రోహం చేసిన వారు మాట్లాడినట్టు అతని సంగతి గుసగుసలుగా చెబుకుంటారే గాని బాహాటంగా చెప్పరు.[116] ఒక్క చలివేంద్ర వుంది. దానిలో ఒక పడుచుదాన్ని పెట్టారు. దానిని చూడడానికి వచ్చే కొండెగాళ్ళ తండాయే ఎక్కువ. ఏం చేస్తాం! నీళ్లు పోసేటప్పుడు చూడాలి మరీ ఎగసక్కేలు, సయ్యాటలూను.[117]

ఏమిటి అలా పరుగెత్తుతున్నారు కుండలు చేత్తో పట్టుకుని? నిప్పంటుకున్నట్టుందే. నా చేతికికూడా ఒక కడవ ఇద్దురూ![118] బారులు తీరి నిలబడండి. ఆమడ దూరం నుండి అయినా సరే నీళ్లు అందిద్దాం. చేతులమీద లాభం లేదు. ఊరంతా నాశనమైంది. చేయదగింది చేశాం. పెద్దఇళ్లు కూలిపోయాయి. మూలబంధం-పునాది-మాత్రం మిగిలింది.[119] గోడ్డూగోడా కాలిపోయాయి. ఖాళీ అయిన ఆ దొడ్డి చూడండి.[120] జనం కూడా మరణించారు. అబ్బా! చూడలేమండి ఆ వైధవ్య వేషాన్ని[121] బలికి తీసుకుపోతున్న దున్నపోతుకు

---

116. రాఅవిరుద్ధం వ కహం పహిఓ పహిఅస్స సాహఇ ససంకం,
జత్తో అంబాణ దలం తత్తో దరణిగ్గఅం కిం పి. 4-96

117. ఉద్ధచ్ఛో పిఅఇ జలం జహాజహా విరలంగులీ చిరం పహిఓ.
పావాలిఆ వి తహాతహా ధారం తణుఇం పి తణుఏఇ. 2-61

118. సవ్వస్సమ్మి వి దద్దే తహ వి హు హిఅఅస్స ణివ్వుది చ్చేఅ
జం తేణ గామడాహే హత్థాహత్థిం కుడో గహిఓ [illegible]

119. ధణ జహాణ నిఅంబోవరి ణహ రంకా గఅవఆణ వణిఆణం,
ఉవ్వసిఆణంగణివాస మూలబంధ వ్వ దీసంతి. 3-33

120. గేహంవ వి త్తరహిఅం ణిజ్ఝరకుహరంవ సలిలసుణ్ణవిఅం,
గోహణరహిఅం గోట్ఠం వ తీఅ విఅణం తుహ విఓఏ. 7-8

121. అణుమరణ పత్థిఆప పచ్చాగఅ జీవిప పిఅఅమమ్మి,
వేహవ్వమండణం కులవహూఅ సోహగ్గఅం జాఅం. 7-33

వేసినట్టు![122] ఏం సంఘమో! అనుమరణం కూడానట. కొండపై నుండి కూడ పడి అనుమరణం చేస్తారటగా.[123] బలే! బలే! ఆయన బతికాడటగా శ్మశానానికి తీసుకువెడుతూవుంటే. విధవా వలయాలు అవిధవాలక్షణవలయా లయ్యాయటగా.[124] ఎవరాయన? ఇల్లు కాలి చస్తుంటే అగ్ని నమస్కారం చేయక సూర్య నమస్కారా లేమిటయ్యా?[125]

అయ్యో! తేలండీ తేలు?[126] ఈ పాడు ఊరినుంచి రేపే వెళ్ళి పోదామనుకున్నాం. తేలుకుట్టింది. ఎలా వెళ్ళడం? వైద్యుడెవడూ లేడూ? మంత్రమా? తంత్రమా? మంగలి వైద్యమా? వైద్యమా? ఏదో చేయించండి. బలే మంత్రమయ్యా! ఏం తలచుకుని చస్తే అదే జన్మ వస్తుందటగా. మరొక జన్మలో ఈ గ్రామం రాకుండ వెంటనే మంత్రం వేద్దురూ! బలే వాడివయ్యా. ఎక్కడో మనసు పెట్టి పెదవులు కదిలిస్తావేం? మంత్రం గట్టిగా అను.[127] పలుపండి! పలువు! ఆయనేనా వైద్యుడు. మామూలు నాపితుడనుకున్నాను. ఎందు

122. గోత్తక్ఖలణం సోఊణ పిఅఅమే అజ్జ తీఅ ఖణదిఅహే.
వజ్ఝమహిసస్స మాల వ్వ మండణం ఉఅహ పడిహాఇ. 5-96

123. ఖరపవణరఅ గలత్థిఅ గిరిఊడావడణ భిణ్ణదేహస్స,
ధుక్కధుకఇ జీఅం వ విజ్జుఆ కాలమేహస్స. 6-88

124. గామణిణో సవ్వాసు వి పిఆసు అణుమరణగహిఅవేసాసు,
మమ్మచ్ఛేఏసు వి వల్లహాఇ ఉవరీ వలఇ దిట్ఠీ. 5-49

125. సూరచ్ఛలేన పుత్తిఅ కస్స తుమం అంజలిం పణామేసి,
హాసకడక్ఖుమ్మిస్సా ణ హోంతి దేవాణ జేక్కారా. 4-82

126. పణఉపురఓ వ్విఅ ణిజ్జఇ విచ్ఛుఅ దట్ఠేత్తి జారవేజ్ఝఘరం,
ణిఉణసహీకరధారిఅ భుఅజుఅలందోలిణీ బాలా. 8-87

127. సంఝాగహిఅ జలంజలి పడిమాసంకంత గోరిముహకమలం.
అలిఅం చిఅ ఫురిఅట్ఠం విఅలిఅమంతం హరం ణమహ. 7-100

కావిడ అలా పరుగెత్తుకొని వస్తున్నది? ఆవిడకు కూడ తేలు కుట్టిందా? మంగలి వైద్యుని చూచి పిల్లవాడు భయపడుతూవుంటే అలా పరిగెత్తుతున్నదా![128] అమ్మయ్య! బతికానురా బాబూ! మంచి మందే. చేదనుకోండి. అయితేనేమి? మందు అందించిన అందగత్తెను చూచి ఎలాంటి మందైనా మింగవచ్చు.[129]

ఇదేమిటి ఈ గ్రామం వస్తే వానలు పట్టుకున్నాయి! బాగానే వుంది. వీధులన్నీ బురద. ఆ బక్క ఆవు బురదలో చిక్కుకుపోయిందే; తీయనా?[130] కదలదేమండీ వెలుపలికి? మనకు నిలువ నీడనిచ్చిన యిల్లాలు యెంత ఉత్తమురాలు! ఇల్లు కారుతున్నా మనకు మాత్రం మంచి స్థలమే చూపింది, తాను కన్నీటితో తడవని ప్రాంతాలు తడుపుతూ.[131] అదృష్టం బాగానే వుంది. ఇక్కడ మనకు నోరు తియ్యనవుతుంది. గహపతి (పెద్దకాపు)గారి కుమార్తె తొలి సమర్తట. తొలి సమర్తగుడ్డను (అనందపటమును) అందరికి చూపడం ఆచారమట. అలా ఎందుకండీ అందరికీ చూపటం?[133] ముఖానికి

---

128. ధావఇ విఅలిఅ ధమ్మిల్లసిచఅ సంజమణ వావడకరగ్గా,
చందిల భఅ వివలాఅంత డింభపరిమగ్గిణీ ఘరిణీ. 3-91

129. సుహపుచ్ఛిఆఇ హలిఓ ముహపంకఅ సురహిపవణణివ్వవిఅం,
తహ పిఅఇ పిఅఇ కడుఅం పి ఓసహం జహ ణ ణిట్ఠాఇ. 4-17

130. కహం సా ణివ్వణ్ణిజ్జఇ జీఅ జహాలోఇఅమ్మి అంగమ్మి.
దిట్ఠీ దుబ్బల గావీ వ్వ పంక పడిఆ ణ ఉత్తరఇ. 3-71

131. పహిఅవహూ వివరంతరగలిఅజలోల్లే ఘరే అణోల్లం పి,
ఉద్దేసం అవిరలవాహసలిల ణివహేణ ఉల్లేఇ. 6-40

132. కారిమ మాణందవడం భామిజ్జంతం పహూఅసహిఅహిం,
పేచ్ఛఇ కుమారి జారో హాసమిస్సేహిం అచ్ఛీహిం 5-?7

133. జఇ లోకణిందిఅం జఇ అమంగలం జఇ విముక్కమజ్జాఅం,
పుప్ఫవఇ దంసణం తహవి దేఇ హిఅఅస్స ణివ్వాణం, 5-80

నేయి రంగు పూత ఏమిటి వికారంగా? అదీ ఆచారమేనా? సరే. ఆ ఇల్లాండ్లు ఎందు కలా దూరంగా కూర్చున్నారు. ఇంటికి వెలుపల వున్నారాశి ముట్టుకోరేమిటి![184] మరి ఈ సమర్త పిల్లో? గహపతి గారికి చాలామంది భార్యలున్నారటగా? ఇంకా పిల్లలు లేరా? మోజు కాబోలు. ఇంతకూ న్యాసం[185] (కుదువ-తనఖా) పెట్టయినా ఎందుకండీ ఈ దుబారా? సరే ఎలాగూ చేయిస్తున్నారు. సమర్త పిల్ల కూర్చునే వెనుక కుడ్యచిత్రాలు సరిగా వేయించండి.[186] మంచి వర్తిక ఇప్పించండి. అరె! అరె! పడిపోతూందండి అమ్మాయి! వడ్రంగిని పిలిపించి ఆసంది (బల్ల) కోళ్లు సమంగా దారం (ప్రమాణ సూత్రం) వేయించి రంపంతో కోయించండి.[187] మేకులు కొటిం చండి. వాయనాలు పంచలా?[188] రాత్రి నాటకం కూడా ఆడారు. చాల బాగుంది. పూర్వరంగంలోనే నాటకం మంచిదని తెలిసి పోయింది. ఏం నాటక మనుకున్నారు? క్షీరాబ్ధిమథనం. నవరసాలూ ఓహో![189]

---

184. వణ్ణఅఘుఅలిప్పముహిం జో మం అఇఆఆరేణ చుంబంతో,
ఏణ్హిం సో భూసణ భూసిఅం పి అలసాఅఇ ఛివంతో. 6-19

185. ణాసం వ సా కవోలే అజ్జ వి తుహ దంతమండలం బాలా,
ఉబ్భిణ్ణ పులఅ వఇలేఢ పరికఅం రక్ఖఇ వరాఈ. 1-96

186. హిఅఅం హిఆఏ ణిహిఅం చిత్తాలిహిఅ వ్వ తుహ ముహే దిట్ఠీ,
ఆలింగణ రహిఆఇం ణవరం ఖిజ్జంతి అంగాఇం. 5-85
వణ్ణక్కమ రహిఅస్స వి ఏసగుణో ణవరి చిత్తకమ్మస్స,
ణిమిసం పి జం ణ ముంచఇ పిఓ జణో గాఢ మువఊఢో. 7-12

187. విరహ కరవత్త దూసహ ఫాలిజ్జంతమ్మి తీఅ హిఅఅమ్మి,
అంసూ కజ్జల మఇలం పమాణసుత్తం వ్వ పడిహాఇ. 2-58

188. దిఢమూల బంధగంఠి వ్వ మోఇఆ కహ వి తేణ మే బాహూ,
అమ్హేహిఁ వి తస్స ఉరే ఖుత్త వ్వ సముక్ఖఆ థణఆ. 8-76

189. మాణదుమ పరుస పవణస్స మామి సవ్వంగ ణివ్వఇ అరస్స.
అవగూహణస్స భద్దం రఇణాడఅ పువ్వరంగస్స. 4-44

ఎందుకయ్యా అంత తొందర అల్లుడూ? పెరట్లో అమ్మాయి నీళ్లు పోసుకుంటుంటే గాజుల చప్పుడైతే ఎందుకలా అదిరిపడతావు? నీళ్లగది తూమునుంచివచ్చే నీళ్లలో పసుపును పరిశీలిస్తున్నావేమిటి?[140] మరదండ్లు బాగానే ఏడిపిస్తున్నారే![141] ఉత్ఫుల్లికలు (విద్దెంవిద్దెం) ఆడించమంటున్నారా?

ప్రస్థానకలశమట! మంగళవారమట! వెళ్లవయ్యా. జ్యోతిష్కుని పిలిపించి హోరలు వేయించి (పలకపై గీతలు మొదలయిన లెక్కలు వేయించి) బాధపడడమెందుకు?[142] లక్ష్మి ప్రక్కనవుండగా ఏమిటయ్యా భయం ప్రయాణానికి?

ఏమిటయ్యా రైతూ అలా చూస్తావు? ఈ ఆకాశం ఎంత బాగా కప్పినా, ఇంతగా కారుతుందేమో అనా? వరదలకు దున్నపోతు కొట్టుకపోతే, మరో దున్నపోతు దొరకదని దాని గంటల పట్టెడను అమ్మవారిగుడికి చేర్చావటగా. మరొక ఊరిలో వెదకలేక పోయావా?[143]

ఈ వూరు ఇంకా బాగుందండోయ్, వానలు వెలిశాయి. దారి బురదే అయినా సత్పురుషుల మనస్సులా పైకి అరి గరుగ్గా, లోపల మెత్తగా వుంది. ఏరువాక అప్పుడే అయిందేమో! తిండితెస్తున్న ఇంటావిడను చూస్తూ దున్నుతున్న కాపు మైమరచిపోతున్నాడు.

---

140. మామి హిఅఅం వ పీఅం తేణ జుఅణేణ మజ్జమాణాఏ,
ణ్హాణ హాలిద్దా కడుఅం అణుసోత్తజలం పిఅంతేణ. 3-46
అపరణ్హాగఅ జామ్మాఉఅస్స విఉణేఇ మోహణుక్కంఠమ్,
వహుఆఇ ఘరపలోహార మజ్జణపిసుణో వలఅసద్దో. 7-88

141. ఉప్ఫుల్లిఆఇ ఖేల్లఉ మా ణం వారేహి హోఉ పరిఊఢా,
మా జహణభారగరుఈ పురిసాఅంతీ కిలిమ్మిహిఇ. 2-96

142. కత్థగఅం రఇబింబం కత్థ పణట్ఠాఓ చందతారాఓ,
గఅణే వలాఅపంతిం కాలో హోరంవ కడ్ఢేఇ. 3-85

143. గహవఇణా ముఅసైరిహ డుండుఅదామం చిరం వహేఊణ,
వగ్గసఆఇం ణేఊణ ణవరిఅ అజ్జాఘరే బద్ధం. 2-72

మేడి వదలకయ్యా, పూబోడిని చూచి[144]. ఇక కొన్ని నెలలకు వరి చేలు పండి తెల్లబారతాయి. హరిదళం అలదుకొన్న ఆటవెలదివలె జనపచేను సొగసవుతుంది. ప్రత్తికాయ, సగంవిచ్చినదీ, ఆ కాపు దంపతులను చూచి నవ్వుతున్నట్టులేదూ?[145] ప్రత్తి చేనును ఎనుపోతు విరగబడి మేస్తున్నది అంటే చూస్తావేమిటి తోలవయ్యా.

గ్రామసమీపంలోనా యవలు విత్తుతారు ? పందులు పాడు చేయవూ? అమ్మాయి, అమ్మాయి కుసుమచేనుల్లో ముండ్లుంటాయి. పూలకోసంపోయి ముళ్లుతొక్కవు. ఆ అమ్మాయి కలమధాన్యాన్ని బాగా కాస్తుందే. చెరుకుగానుగాడడం కూడా రెండు నెల్లకే కదూ? నిలువెత్తు పెరిగివ నూలచేనులోను వరిచేనులోను దాక్కున్నా కని పించం సుమండీ!

ఏమి పాడేస్తున్నాడయ్యా రైతు; పైరు కోర్కెదైవార పండంగాను చక్కగా దంచిన బియ్యంలా వున్న వెన్నెల్లో హాయిగా గొంతు విప్పాడు.[146] ఈ పొలంచుట్టూ కంచె వేసుకోవయ్యా. బాగా మొరిగే కుక్కను బలే సంపాదించావులే. అదలించవయ్యా వెళ్లిపోతాం.

బాగా పండింది. బాజాలు, భజంత్రీలు, నాట్యాలు, సరే. మురజానికి మరింత అన్నంమెత్తి వాయించండి. ఇదేమిటి ఈ మహిష బలి? శ్యామాకవ్రతం చేసుకోండి; వాయనాలు పంచిపెట్టండి; తినండి. బుద్ధుని ఒకవైపు పూజిస్తూ ఇదేమిటి బలి ? శ్మశానంబూది

---

144. ణవకమ్మిఏణ హాలపామరేణ దట్ఠూణ పాఉహారిఓ,
మోత్తవ్వే చోత్తలవగ్గహమ్మి అలహాసిణీ ముక్కా. 7-92

145. అజ్జం మోహాణ సుహిఅం ముఅత్తి మోత్తూ పలాఇవ హాలిఏ.
దర ఫుడిఅ వేంటభారోణఅఇ హసిఅం వ ఫలహీఏ. 4-69

146. ణిప్పణ్ణ సస్సరిద్దీ సచ్ఛందం గాఇ పామరో సరఏ,
దలిఅ ణవసాలితండుల ధవలమిఅంకాను రాఈసు. 7-89

పూసుకున్న కాపాలి కూడా వున్నట్టుందే. కానివ్వండి. కాని ఒక వైపు విష్ణుపూజ కూడానా? కృష్ణుడంటే కూడ పడిచస్తారటగా!

చలి, చలి, ఎముకలు కొరికేచలి. ఎందుకు వచ్చాం రా ఈ ఊరికి బాబూ! పట్టి కుగ్రామం. శిథిలదేవాలయం ముందెవరో చలిమంట వేస్తున్నారు. వెళ్లదాం. గడ్డినెగడు ఆరిపోతున్నది. దానిని కర్రతో కదుపుతూ ఎలుగుబంటిని చీల్చుతున్నట్టు సాహసం చేస్తున్నాడు ఒకాయన.[147] ఏం దేవళం ఇది? గణపతి విగ్రహం ఇలా పడిందే? ఒక ప్రక్క అరిగిపోయిందేం? తలగడగా ఉపయోగించుకొనేవారా ఏమిటి?

పిడకనిప్పు పొగకంపులో పోగులు సడలిన చిరుగుగుడ్డలు కప్పుకొని పేదవారెలా బాధపడుతున్నారో?[148] ఒక కాపు వచ్చడం అమ్మి యెద్దును కొన్నాడట. చలిలేదా నీకు అని అంటే, రెండు కుమ్ములఆ జవరాలు వుందిలే అన్నాడట, ఈ ఊరిలోనేనా? ఇదేమిటయ్యా, ఆతిథ్యకూడా సరిగాలేదు. ఉప్పు అన్నం చాలా? వ్రేళ్ళన్నానేతిలో తడపవద్దూ. ఊరంతా విపరీతంగా వుందే. క్రొత్త జున్నుపాలు (నవ పీయూషం) త్రాగిన గేదెదూడలాగ మధ్యాహ్నం నిద్రపోతే జబ్బుకాదూ చలికాలంలో! వింత కుక్కను పెంచిందయ్యా ఆవిడ. మగని చూస్తే మొరుగుతుంది; మిండని చూస్తే మెడవూపుతుంది. రాత్రి యింటి ముంగిట్లో పండుకుంటే, ఇక్కడ నేను, యిక్కడ అత్తగారు, యిక్కడ తక్కినవారు అంటుందేమిటి అవిడ? మాకు రేజీకటి లేదే?[149]

---

147. ఫాలేఇ అచ్ఛభల్లం వ ఉఅహ కుగ్గామదేఉలద్దారే,
హేమంతఆల పహిఓ విజ్ఝాఅంతం పలాలగ్గిం. 2-9

148. సూఇజ్జఇ హేమంతమ్మి దుగ్గఓ పుఫ్ఫుఆసుఅంధేణ,
ధూమకవిలేణ పరివిరలతంతుణా జుణ్ణవడఏణ. 4-29

149. ఏత్థ ణిమజ్జఇ అత్తా ఏత్థ అహం ఏత్థ పరిఅణో సఅలో,
పంథిఅ రత్తీఅంధఅ మా మహ సఅణే ణిమిజ్జిహిసి. 7-67

ఇక్కడ గోరువంకలు, చిలుకలు, గయ్యాళివే. రాత్రి పడక టింటి సంగతులు పగలు వీథిని పడేస్తాయి. ఇతను మనశరణువేడాడు కాపాడమంటూ మిండగాణ్ణి మగనికే అప్పగించిందట ఒక జాణ.

తొలికాన్పువేళ నొప్పులు పడలేక మగని మాట ఇక వద్దంటుందటగా వొక ప్రసూతివిరాగిణి. దయ్యాలుకూడా వున్నా యటగా ఈ వూళ్ళో. మంచి కట్టెలు దొరకవా? యేమిటూ పొగ? పొమ్మనలేక—పొగపెట్టడమా యిది?

గుండె తరుక్కుపోతుంది, అకమలవనాన్ని చూస్తే. ఊరి కంతా ఒక్క నిొమ్ముగావున్న కమలవనం మంచుకు చెడి రాలిపోయి కోసినసువ్వుచేనిలా దంట్లతో మాత్రం మిగిలింది. గుడిగోడమీద గీత లేమిటి ఏవో సంకేతాలులా ? రెండక్షరాలు వ్రాయడానికి చేతకాని వారే ఊరివారిలో చాలామంది. ముత్యాలువదలి గురివిందలకు మోజు పడతా రేమిటి ఆడవారు? అడుసులో చిక్కుకున్న నాగలిని ఈడ్చి మగడు అలసి నిద్రపోగా, ఆ కాపువడతి ఉపచారం చేయడంమాని వియోగబాధపడుతుందేమిటి? పేదల కోరికలు తీరే అవకాశమే లేదే ఇక్కడ!

మరదులతో వదినెల ఎకసెక్కాలేమిటి? వెట్టివాని భార్య వాదకంతా వదిన అంటే ఇదేనా? అయ్యో, అయ్యో! అదేమి పాప కర్మ! ఆడవాళ్లు బందిలా? వాళ్లు బలవంతులై మిమ్మల్ని బందీలుగా తీసుకుంటే? వద్దుబాబూ! ఈ వూరు! మరొక మంచి వూరికిపోదాం.

బయలుదేరి సంవత్సరమైంది కదా! మరొక ఊరెందుకు? నవవసంతరాజు రథశిఖరంధ్వజంలా మామిడి చివుళ్లు కనిపిస్తు న్నాయి. ఆ మోదుగు మొదలు చుట్టూపడిన మోదుగుపూలు చూడండి. తథాగతుని పాదాలపై ఎరగిన భిక్షుసంఘాలులాగ ఉన్నవి. మనమూ సమంతభద్దుని స్మరిస్తూ మనఊరికే వెళ్లదాం. [150]

---

150. కీరముహా సర్చహేహిం రేహఇ వసుహా పలాసకుసుమేహిం,
బుద్ధస్స చలణ వందణ పడిఏహింవ భిక్షు సంఘేహిం. 4-8.

## ౩౹

# గాథా సప్తశతి-కాళిదాసు అనుకరణ

ప్రతి కవీ తన పూర్వ కవి రచనలను చదువకపోడు. సామాన్య కవి పూర్వ కవుల రచనలను యథాతథంగానే వాడుకుంటాడు; క్షేమేంద్ర రాజశేఖరు లన్నట్టు పద పాద అర్ధ సంపూర్ణ శ్లోక చోరు డని అనిపించుకొంటాడు. కాని, నిపుణుడైన కవి తాను గ్రహించిన దానిపై మెరుగులు పెడుతాడు; ఇతరులనుంచి తీసుకొన్నది గాదు; స్వంతంది అనే భ్రాంతి కలిగిస్తాడు. కాళిదాసు కూడా తన పూర్వుల యిన వ్యాస వాల్మీకి భాసాశ్వఘోషులనుంచే కాక జానపద కవుల నుంచీకూడా ఎంతో తీసుకొన్నవాడే. కాళిదాసు కుమారసంభవంలో పార్వతీదేవిని వర్ణిస్తూ

> "మధ్యేన సా వేది విలగ్న మధ్యా
> వళిత్రయం చారు బభార బాలా" (1-౩౯)

అని ఆమె నడుమును యజ్ఞవేదితో పోల్చాడు. "ఎంత సొగసుగా ఉంది పోలిక!" అన్నారు సహృదయులు. "వైదిక సంప్రదాయాన్ని కాపాడాడు" అని మెచ్చుకొన్నారు కవిని. వైదికులు, యజ్ఞవేది స్వరూపం తెలిసినవారు గనుక. "స్కందునివంటి వాని అవతరణకు శివుడు హోమం చేయాలి కదా. పార్వతీదేవి నడుము యజ్ఞ వేది కాక మరేమవుతుంది?" అని అతిసంప్రదాయవాదులు విశేషాలు లాగారు. ఇది వ్యాసుడు భారతంలో ప్రకరణాంతరంలో చెప్పిన పోలిక అని తెలిసిన తర్వాత, వ్యాసునిపై గౌరవం హెచ్చింది. ఇలాగే ఎన్నో! తన కాలానికి ముందు కమనీయ కవితా కోశంగా, తన సమకాలంలోను ప్రవరసేనుని వంటి బహుకార్య వ్యాపృతుడైన వాకాట రాజు సేతుబంధం వంటి ప్రాకృత కావ్యాన్ని రచించడానికి

కారణంగా ఉన్న గాథా సప్తశతిని కాళిదాసు చూడకపోవడం సంభవించి వుండదు. కనుకనే దానిలోని భావాలు, భావాల ఛాయాంతరాలు, పదబంధాలు కాళిదాసు రచనలలో కానవస్తాయి. నేను కాళిదాసు గాథాసప్తశతి నుంచి గ్రహించి వుండవచ్చుననే సంభావనతో యాదృచ్ఛికంగా తెలుసుకొన్న కొన్ని అంశాలను మాత్రమే ఇక్కడ నివేదిస్తాను. కాళిదాసు, ఆతని రచనల ఆంతర సాక్ష్యాన్నిబట్టి గుప్తవంశీయులైన చక్రవర్తులు చంద్రగుప్త స్కంద గుప్త కుమారగుప్త ప్రవరసేనుల సమకాలికుడనే నమ్మకంమీదే నా యీ వాదం ఆధారపడి వుంది.

(1) ఆశాబంధః :

కాళిదాసు ఆశాబంధః అనే అపూర్వమయిన పదబంధం వాడి సహృదయ లోకాన్ని పులకితులను చేశాడు.

"తాంచావశ్యం దివసగణనా తత్పరా మేకపత్నీం
అవ్యాపన్నా మవిహిత గతిః ద్రక్ష్యసి భ్రాతృజాయామ్,
ఆశాబంధః కుసుమసదృశం పాయశోహ్యంగనానాం
సద్యః పాతి ప్రణయి హృదయం విప్రయోగే రుణద్ధి."
(మే. పూ. 10)

ఓ మేఘుడా, నీ వదిన నా విరహపు దినాలు ఇంకా ఎన్ని మిగిలి ఉన్నయో అని లెక్కపెడుతూ, నాకోసం ఇంకా జీవించి వుంటుంది. నీవు నిరాఘాటంగా వెళ్ళి ఆమెను చూస్తావు. మహిళల మనస్సు ప్రేమపూర్ణం, కుసుమ సుకుమార మైంది. అలాటిది వియోగంలో రాలిపడిపోకుండా ఆశాబంధం- ఆశ అనే పట్టు - అడ్డగిస్తుందనుకుంటాను - అని యక్షుడు మేఘునితో అంటాడు, ఈ ఆశాబంధాన్ని కాళిదాసు విక్రమోర్వశీయంలోను ప్రయోగించాడు.

"రాజా :- (చంద్రమసమవలోక్య విదూషకం ప్రతి) వయస్య, పరం ముహూర్తా దాగమనం దేవ్యాః. తద్వివిక్తం కథయిష్యామి స్వామవస్థామ్.

విదూషకః- "నను దృశ్యత ఏవ సా కింతు తాదృశ మనురాగం ప్రేక్ష్య, శక్యం ఖలు ఆశాబంధేన ఆత్మానం ధారయితుమ్." [రాజు: (చంద్రుణ్ని చూచి విదూషకునితో) వయస్య, దేవి రావడానికి గడియ ఉంది. కనుక ఏకాంతంగా నేను నా మానసికా వస్థను తెలుపుతాను.

విదూషకుడు :- ఆ అవస్థ కనిపిస్తూనే ఉందే. కాని ఊర్వశి నీపైన చూపిన అలాటి అనురాగాన్నిబట్టి ఆశాబంధంతో నిన్ను నీవు నిలబెట్టుకోవచ్చు.]

ఆశాబంధం శాకుంతలంలోను ఉంది. చతుర్థాంకంలో శకుంతల దుష్యంతునివద్దకు వెళ్ళుతున్నప్పుడు అనసూయ "ఆశాబంధో సహోవేది" (5-16) అంటుంది.

ఈ ఆశాబంధం గాథాసప్తశతిలోనిది.

"విరహాణలో సహిజ్జఇ ఆశాబంధేణ వల్లహజణస్స,
ఏకగ్గామ పవాసో మాప మరణం విసేసేహి." 1-43

[విరహానలః సహిష్యతే ఆశాబంధేన వల్లభ జనస్య,
ఏకగ్రామ ప్రవాసః మాతః మరణం విశేషయతి.]

అమ్మా, ప్రియుడు మరొకచోటికి ప్రవాసం వెళ్ళితే, ఆ ప్రియ వ్యక్తి నిప్పులవంటి విరహాన్ని ఆశాబంధంతో-మళ్ళీ తిరిగి వస్తాడు గదా అనే ఆశతో-సహించవచ్చు. కాని, ఒకే ఊళ్లో విడిపోయి వుండడ మనేది చావును మించినట్టిది సుమా!- అంటుంది ఒక ప్రేమైక జీవిని.

ఈ ఆశాబంధాన్ని భాసుడూ, ప్రవరసేనుడూ వాడినారు, సీతాన్వేషణకు వెళ్లిన హనుమంతుడు ఎంతకాలమయినా తిరిగి రాలేదు. హనుమంతుడే రాముని ఆశాబంధం. మొదలే చిక్కిపోయి నది రాముని శరీరం. హనుమంతుని రాక ఆలస్యమయ్యేవరకు అతని ముఖం - కన్నీటితో నిండిన ముఖం, రోదించినట్టు కనిపించింది.

"ఛిజ్జఇ ఝిణ్ణావి తణూ
అట్టిఅవాహం పుణో పరుణ్ణంవ ముహమ్,
రామస్స అరుసంతే
బంధే వ్వ చిరనిగ్గప హణుమంతే." (1-35)

[క్షీయతే క్షీణాపి తనుః
అస్మిత బాష్పం పునఃప్రరుదితమివ ముఖం,
రామస్య అదృశ్యమానే
ఆశాబంధే ఇవ చిర నిర్గతే హనూమతి] 1-35

అని ప్రవరసేనుడు సేతుబంధంలో వర్ణించాడు.

2. భుజగవలయం :-

మన దేశంలో శైవ మతం అతి ప్రాచీన మయింది. కనుక శైవ కథలు గాని, శివ లీలలు గాని ఒకరు మరొకరినుంచి తీసు కొన్నారనడం అంత ఉచితం కాకపోయినా, ఒక నిర్దిష్ట క్రియా విశేషమో, పదబంధమో ముందువాడు చెప్పినది, తర్వాతివాని రచనలలో కనిపించినప్పుడు మన దృష్టి కొంచెం ఆగుతుంది. కాళిదాసు మేఘ సందేశంలో

"హిత్వా తస్మిన్ భుజగవలయం శంభునా దత్తహస్తా
క్రీడా శైలే యది న విచరేత్ పాదచారేణ గౌరీ,
భంగీభక్త్యా విరచిత వపుః స్తంభితాంతర్జలౌఘః
సోపానత్వం కురు మణితటారోహణాయాగ్రయాయీ."
(మే. పూ. 64)

యక్షుడు మేఘునికి చెబుతున్నాడు : ఓ మేఘుడా, కైలాస పర్వతం మీద శివ పార్వతులు క్రీడా పర్వతంమీద విహరించదలచి నప్పుడు, పార్వతి భయపడుతుందని తన చేతి భుజగవలయాన్ని తీసి కిందపెట్టి గౌరి చేయిని పట్టుకొని క్రీడా పర్వతాన్ని అధిరోహించ డానికి యత్నించదలిస్తే, అప్పుడు నీవు, ముందుగానే వెళ్లి, నీలోని

నీటినంతా లోపలే పెట్టుకొని, గౌరీ దేవి మణితటాలు ఎక్కడానికి సులువుగా నిన్ను మెట్ల వరుసలాగ వంపులు వంపులుగా మార్చుకో.

కాళిదాసు భుజగవలయం గాథాసప్తశతిలోని వాసుకి కంకణం తప్ప మరేమీ కాదు. పాణిగ్రహణం సమయంలోనే శివుని చేతి వాసుకి కంకణం చూచి పార్వతి భయపడుతుంది. అది గ్రహించి శివుడు వాసుకి వలయాన్ని దూరంగా విసిరిపారేశాడు. దానితో పార్వతి చెలికత్తెలు తెలుసుకొన్నారట, ఆమె సౌభాగ్యం, పతి ప్రేమ ఎలాటివని. పెళ్లినాడే ఇలా ఇలా అయితే, తర్వాత చెప్పనక్కరలేదు.

"పాణిగ్గహణే జ్విఇ పవ్వఈఏ ణాఅం సహీహి సోహగ్గం,
పసువఇణా వాసుఇ కంకణమ్మి ఓసారిఓ దూరమ్." 1-68

[పాణిగ్రహణ ఏవ పార్వత్యాః జ్ఞాతం సఖీభి సౌభాగ్యమ్,
పశుపతినా వాసుకి కంకణే అపసారితే దూరమ్.]

ఈ వాసుకి కంకణం పాణిగ్రహణం వంటి శృంగార సన్నివేశంలో ప్రయుక్తమయింది గనుక కాళిదాసు దీనిని పాణిగ్రహణానంతర విలాస యాత్రలో మరింత మధురంగా పదాలు మార్చి భుజగ వలయంగా గ్రహించి ప్రయోగించాడనవచ్చు,

## 3. అభినవ మధు :-

శాకుంతలంలోని ఒక ఘట్టం: శకుంతలాసక్తుడైన దుష్యంతుణ్ణి హంసపదిక ఎత్తి పాడుస్తుంది "ఓ మధుకర, నీవు ఎప్పటికప్పుడు కొత్త కొత్త మధువును వెదుక్కుంటూ వుంటావు. మామిడి పూగుత్తిని అంతగా అనుభవించి ఇప్పుడు, కమలంలో వసించి సంతృప్తితో మమ్ములను మరిచిపోయావు!" అని.

"అహిణవ మహులోలుఓ తుమం
తహ పరిచుంబిఅ చూఅమంజరిం,

కమళ వసదిమెత్తణివ్వుదో
మహుఅర విమ్హరిఓసి ణం కహం?" (శా. 5-1)

ఇది ప్రాకృత గీతం. ఎంతో మధురంగా వుంది. కాని, గాథా సప్తశతి అనుసరణ కావడం తప్పలేదు.

గాథా సప్తశతిలో ఒక ఖండిత నాయిక తన ప్రియుణ్ణి ఇలాగే ఉపాలంభిస్తుంది :

"ఓ మధుకరా, పూర్వం మాలతితో వుంటూ, కృతార్థుడినని భావించుకొంటూ, తక్కిన పూవులంటే ఇష్టపడేవాడివి కావు. ఇప్పుడు మాలతి ఫలభార గుర్వి అయింది. కనుక వదిలిపెట్టి వెళ్లావు."

"తఇఆ కఅగ్ఘ మహుఅర ణ రమసి అణ్ణాసు పుప్ఫజాఈసు,
బద్ధ ఫల భార గురుఈం మాలఇం ఏహ్మిఀ పరిచ్చఅసి" (1-92)
[తదా కృతార్థ మధుకర న రమసే అన్యాసు పుష్పజాతిషు,
బద్ధ ఫలభార గుర్వీం మాలతీ మిదానీం పరిత్యజసి.]

ఈ గాథలోని భావం, కాళిదాసు హంసపదిక ఆవేదన ఎంత మాత్రమూ భిన్నమయినవి కావని సహృదయులకు తెలుసు.

4. ప్రమాణ మంతఃకరణం :-

దుష్యంతుడు కణ్వాశ్రమంలో శకుంతలను చూచాడు. తనకు ఆమె పరిగ్రహించ దగిందో కాదోనని అనుమానం కలుగుతుంది. తన అంతఃకరణమే ప్రమాణం అనుకొని సందేహం తొలగించుకుంటాడు.

"అసంశయం క్షత్ర పరిగ్రహ క్షమా
య దార్య మస్యా మభిలాషి మే మనః,
సతాం హి సందేహపదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః" (శా. 1-21)

గొప్పవారికి సందేహం కలిగినప్పుడు అంతఃకరణమే ప్రమాణమనే భావం గథాసప్తశతిలోని భావమే. తనను తప్పించుకొని తిరుగుతున్న ప్రియుణ్ని ఒక ప్రేమిక ఇలా అంటుంది. "జనం ఎలా అనుకుంటే ఏం ? జనం అడిక అలావుండనీ. నీవు నన్ను ఎంత మాత్రం ప్రేమిస్తున్నావో నీకు నీ హృదయమే ప్రమాణం. నీకు నామీద స్నేహం ఎంతగా తగ్గిపోయిందంటే, నిన్ను ఉపాలంభించడం, తూలనాడడం కూడా తగదు అన్నంతగా."

"అచ్చుఉ తా జణవాఓ హిఅఅం విఅ అత్తణో తుహ పమాణం,
తహ తం సి మంద ణేహో జహ ణ ఉవాలంభజోగ్గోసి." (కి-1)

[అస్తు తావ జ్జనవాదః హృయదమేవాత్మనః తవ ప్రమాణమ్,
తథా త్వమసి మందస్నేహః యథా నోపాలంభ యోగ్యోసి.]

నీ హృదయమే నీకు ప్రమాణం-అనే సామాన్యమైన పలుకుబడిని, నీ మనసు నీకు తెలీదా అన్న సామాన్యుల మాటను గాథాసప్తశతి సహజసుందరంగా చెబితే, కాళిదాసు రాజస్వార్థాన్ని ఏదేదో పెద్ద మాటలతో "గొప్పవారికి సందేహం ఏర్పడినప్పుడు అంతఃకరణమే ప్రమాణం" అనే తర్కంతో మేళవించి చెప్పాడు.

5. ప్రేమలేఖ :-

శకుంతల దుష్యంతునికి ప్రేమలేఖ వ్రాస్తుంది. ఈ ప్రేమలేఖ లేఖనం రామాయణ, భారతాలనుంచి తీసుకొన్నట్లు కనిపించదు. ఆదర్శ ప్రేమికుడయిన రాముడు హనుమంతునికి ఒక చీటి వ్రాసి పంపవచ్చుగదా, లంకకు! పంపలేదు. ప్రేమమూర్తులయిన నలదమయంతులో, సావిత్రి సత్యవంతులో, రురు ప్రమద్వరలో ప్రేమలేఖలు వ్రాసుకొన్నట్టు భారతంలో లేదు. రుక్మిణీ అంతే. లలిత విస్తరంలో తనకు ఇలాటి లక్షణాలుగల కన్య కావాలని గౌతమ సిద్ధార్థుడు పురోహితుని చేతికొక లేఖ వ్రాసి పంపినట్టు, దానికి యశోధర సమాధానం చెప్పినట్టు వుంది. కనుక శకుంతల లేఖ

వ్రాయడమనే సన్నివేశానికి (శా. 5-14) గాథాసప్తశతిలోని గాథలే కారణమయి వుంటాయి.

ఒక విరహిణి ప్రియునికి జాబు వ్రాయబూనుకుంటుంది. వ్రేళ్ళు చెమర్చి లేఖని జారిపోతుంది. వ్రాత కూడ సరిగా కుదరదు. "స్వస్తి అనే వ్రాయలేఖ పోతున్నానే ప్రియసఖ, ఏమి వ్రాయను?" అని సఖిని ప్రశ్నిస్తుంది.

"వేవిరసిణ్ణ కరంగులి పరిగ్గహక్ఖలిఅ లేహణీమగ్గే,
సోత్థిచ్చిఅ ణసమప్పఇ పిఅసహి లేహమ్మికిం లిహిమో!"(1-44)
[స్వేద స్విన్న కరాంగుళి పరిగ్రహస్ఖలిత లేఖనీ మార్గే,
స్వస్త్యేవ న సమాప్యతే ప్రియసఖి లేఖే కిం లిఖామః]

వేవిర అనే పదానికి వేపనశీల అని ఛాయ వ్రాశారు పూర్వులు. కాని, వేవిర అంటే స్వేదమని నేను-వేప్పం, వెవరు, బెవరు, బేర్పిండు అని తెలుగు తోబుట్టువులో వున్నందున బెవరు వేవిరగా మారి వుంటుందని నిర్ణయించుకున్నాను.

కాళిదాసు ఈ లేఖన భావాన్ని మాత్రమేకాక పదాలను కూడ ప్రకరణాంతరంలో ప్రయోగించడం చూడగా, గాథాసప్తశతిని తప్పక చదివి వుంటాడనే అనిపిస్తుంది. షష్ఠాంకంలో దుష్యంతుడు విరహతాపాపనోదరార్థం శకుంతల చిత్రం గీచినప్పుడు, చిత్రం అంచులలో చెమర్చిన తన వేలి గుర్తులున్నవి- "స్విన్నాంగుళి వినివేశో రేఖోపాంతేషు" (6-15) అని స్విన్నాంగుళిని ప్రయోగించాడు.

6. తిప్పుతున్న ముఖం :-

దుష్యంతుడు మూడవ అంకంలో శకుంతల వెళ్ళిపోయిన తర్వాత, శకుంతలను ముద్దు పెట్టుకోకపోతినే అని చింతిస్తాడు "పెదవులను ముద్దు పెట్టుకోవాలనుకున్నాను. వేళ్ళు అడ్డు పెట్టింది.

వద్దు వద్దు అంటూ గింజుకుంటూ మరింత అందంగా కనిపిస్తూన్న ముఖం ఎలాగో పైకి ఎత్తాను. పెదవి దొరక్కుండా ముఖం తిప్ప సాగింది. దట్టమైన కనురెప్పలు—ముద్దు పెట్టుకోలేక పోయాను!"

"ముహురంగులి సంవృతాధరోష్ఠం
ప్రతిషేధాక్షర విక్లబాభి రామమ్,
ముఖ మంసవివర్తి పక్ష్మలాక్ష్యాః
కథమ ప్యున్నమితం న చుంబితంతు." (3-23)

ప్రియుడు ప్రియురాలిని ముద్దు పెట్టుకొనే ప్రయత్నం చేయడం, ముఖం అటు ఇటు తిప్పడం, అలకలు అటూ ఇటూ కద లాడుతూ, తుమ్మెదలు మూగిన కమలం లాగ వుంది ముఖం అంటూ ప్రియుడు స్మరించడం- ఈ భావం గాథాసప్తశతిలో వుంది.

"భరిమో సే గహిఅహార ధుఅ సీసపహోలిరాలఅఉలిఅం,
వఅణం పరమల తరళిఅ భమరాలి పఇణ్ణ కమలం వ.'' (1-78)

[స్మరామః తస్యాః గృహీతాధర
ధుత శీర్ష ప్రఘూర్ణన శీలాలకాకులితమ్,
వదనం పరిమళ తరలిత
భ్రమరాళి ప్రకీర్ణ కమల మివ.]

గాథా సప్తశతిలోనేమో నాయకుడు ముద్దు గట్టిగా పెట్టుకొన్నాడు. విడిపించుకోవటానికి తల అటూ ఇటూ ఊపింది నాయిక; ముంగురులు అందంగా ఊగిసలాడాయి. కాళిదాసు ఈ గాథలోని పూర్వార్థం పెంచి మధురాతి మధురం చేశాడు.

## 7. కండూయనం :-

శివతపోభంగానికి మన్మథుడు అన్ని ఏర్పాట్లు చేస్తాడు. చరా చర ప్రపంచమంతా శృంగార రాగ రంజిత మవుతుంది. గండు తుమ్మెద పెంటి తుమ్మెదను అనుసరిస్తూ, ఒకే పుష్పపాత్రలో మధు

వును బువ్వంబంతిగా తాగుతుంది. మగజింక తన కొమ్ముతో ఆడ జింకను గోముగా కోరాడింది. ఆ ఆడ జింక దాని తాకిడికి ఆనందంగా కన్నులు మూసుకొంది.

"మధు ద్విరేఫః కుసుమైక పాత్రే
పపౌ ప్రియాం స్వా మనువర్తమానః,
శృంగేణ చ స్పర్శ నిమీలితాక్షీం
మృగీ మకండూయత కృష్ణసారః." (కు. 3-36)

ఈ భావం ప్రకరణాంతరంలో గాథాసప్తశతిలో చెప్పినదాని అనుసరణ అనిపిస్తుంది. ఒక భూస్వామి గోష్ఠంలో ఎన్నో ఆవులు. ఎద్లు ఉన్నాయి. వాటిలో ఒక కొవ్వెక్కిన, దుడుకు కోడెద్దు ఉంది. దాని కొమ్మున ఒక ఆవు తన కండ్లను రాచుకొన్నదట. చూచావా దాని సౌభాగ్యం; ఎంత నిర్భయంగా తన గొప్పదనం చాటుకుంటున్నదో!-అని ఒక నాయిక మరొకతెకు సాభిప్రాయంగా చెబుతుంది.

"పాఅడిఅం సోహగ్గం తంబాఏ ఉఅహ గోట్ఠమజ్ఝమ్మి,
దుట్ఠ వసహస్స సింగే అక్ఖిఉడం కండుఅంతీఏ." (5-40)

[ప్రకటితం సౌభాగ్యం గవా పశ్యత గోష్ఠమధ్యే,
దుష్ట వృషభస్య శృంగే అక్షిపుటం కండూయంత్యా.]

ఇక్కడ ఆవు తన కంటిని ఎద్దుకొమ్మున రాచుకుంటే, కాళిదాసు శృంగార రసవ్యంజన కోసం జింకల జంటను గ్రహించాడు. ఈ గోముగా గోకడాన్ని కాళిదాసు గ్రహించాడనడం స్పష్టం.

ఈ భావాన్ని కాళిదాసు శాకుంతలంలోను గ్రహించాడు. ఆరవ అంకంలో దుష్యంతుడు విదూషకునితో తను గీయదలచిన బొమ్మను వివరిస్తున్నప్పుడు పెంటి జింక తన ఎడమ కన్నును పోతు జింక కొమ్మున గోకుకుంటున్నట్టు కూడ గీస్తానంటాడు.

"కార్యా సైకతలీన హంస మిథునా స్రోతోవహా మాలినీ
పాదా స్తాః పరితోనిషణ్ణ హరిణా గౌరీగురోః పావనాః,

శాఖాలంబిత వల్కలస్య చ తరో ర్నిర్మాతు మిచ్ఛామ్యథః
శృంగే కృష్ణమృగస్య వామనయనం కండూయమానాం
మృగీమ్." (శా. 6-17)

8. బాష్పం :-

కన్నులలో కన్నీరు ఏ కారణంతో నిండినా, దృష్టి ప్రసరించదు. యక్షుడు ఇలా సందేశం పంపుతాడు! "ఓ ప్రియురాలా! నీవు ఒకమారు కోపం చేసుకొన్నావు. ప్రణయకుపితురాలైన నీ బొమ్మను నేను అడవి మట్టిరంగులతో బండమీద గీచి, నీ కాళ్ల మీద (బొమ్మ కాళ్లమీద) పడుదామని, క్షమించమని కోరుదామని అనుకొని, కాళ్ల మీద పడేలోగా కళ్లనీరు కుక్కుకొనివస్తాయి. దృష్టి అడ్డగిస్తుంది. ఏమీ కనిపించదు. కనుక, ఆ విధంగానూ-నీ బొమ్మను తాకలేక పోతాను. చూచావా కృతాంతుని లీల! అలాగే మన సమాగమం సహించదు."

"త్వా మాలిఖ్య ప్రణయ కుపితాం ధాతురాగైః శిలాయాః
ఆత్మానం తే చరణపతితం యావ దిచ్ఛామి కర్తుమ్,
అస్రై స్తావన్ముహురుపచితైః దృష్టిరాలుప్యతే మే
క్రూర స్తస్మి న్నపి న సహతే సంగమం నౌ కృతాంతః."
(మే. ఉ. 47)

సుందరమైన బాష్పావరుద్ధ దృష్టికి మూలం గాథాసప్తశతిలో ఉంది. ఒక విరహిణి అవస్థను దూతి ప్రియునికి వివరించే ఘట్టం.

"ఓ నాయకుడా, నీ విరహం నాయికకు నిద్రపట్టనివ్వడం లేదు. నిద్ర లేకపోవడంవల్ల స్వప్నం రాదు కనుక నిన్ను స్వప్నంలోను చూచే ఆశ లేదు. నీవు హఠాత్తుగా ఎదుటపడితే చూచి వినోదిద్దామా అంటే, కన్నులు కన్నీటితో నిండిపోయి చూపు అడ్డగించడంవల్ల అదికూడ సంభవించడంలేదు."

"తుహ విరహుజ్జాగరఓ సివిణేవి ణ దేఇ దంసణ సుహాఇం,
వాహేణ జహాలోఅణ విణోఅణం సే హఅం తం పి."(5-87)

[తవ విరహో జ్జాగరకః స్వప్నేపి న దదాతి దర్శనసుఖాని,
బాష్పేణ యదాలోకన వినోదనం తస్యా హృతం తదపి.]

ఈ గాథలోని ఉత్తరార్ధ భావాన్ని కాళిదాసు గ్రహించి వుంటాడనడం స్పష్టం.

**9.** అశిక్షిత పటుత్వం :-

కాళిదాసు స్త్రీపాత్రలను తన కాలవు రాజరికం దృష్టితో చూచాడు, అలాగే తీర్చాడు అనేది విషయాంతరం. స్త్రీలు సహజ కపటులని, జాణలని స్త్రీ జాతిపైన ఒక్క విసురు విసిరాడు, దుష్యంతుని ద్వారా. దుష్యంతుడు అంగుళీయకం కోల్పోవడంవల్ల నష్ట స్మృతుడై శకుంతల ఎన్ని ఆనవాళ్లు చెప్పినా నమ్మక నిరాకరిస్తూ, "ఇలాటి జాణతనం స్త్రీలకు వెన్నతోనే పెట్టిన విద్య, మానుషుల విషయంలోనే కాదు. పక్షులలోను పెంటిజాతికీ ఈ జాణతనం వుంది. కోకిలమ్మ తన గుడ్డును కాకి గూటిలో పెట్టి పొదిగించదూ?" అని ఎత్తిపొడుస్తాడు.

"స్త్రీణా మశిక్షిత పటుత్వ మమానుషీషు
సందృశ్యతే కిముత యాః ప్రతిబోధవత్యః,
ప్రా గంతరిక్ష గమనాత్ స్వ మపత్యజాతం
అన్యైః ద్విజైః పరభృతాః ఖలు పోషయంతి."(శా. 5-22)

గాథాసప్తశతి ప్రసంగాంతరంలో మహిళల చాతుర్యాన్ని వర్ణిస్తూ, "సురతకేళిలో మహిళలకు ఎవరు ఉపాధ్యాయుడు? స్నేహానుబంధంతో అందరూ తెలీనివి అన్నీ నేర్చుకుంటారు" అని ఒక విలాసినిచాతుర్యాన్ని ఒకతె తన సఖితో అనిపిస్తుంది.

"బహువిహా విలాసరసిప సురఏ మహిలాణ కో ఉపజ్ఝాఓ,
సిక్ఖఇ అసిక్ఖిఆఇ వి సవ్వో ణేహాణుబంధేణ" (5-77)

[బహువిధ విలాసరసికే సురతే మహిలానాం క ఉపాధ్యాయః?
శిక్ష్యతే అశిక్షితాన్యపి సర్వః స్నేహానుబంధేన.]

మహిళలు రహస్య విషయాలు గురువు లేకుండానే నేర్చు కుంటారని శృంగార సందర్భంగా చెప్పినదానిని కాళిదాసు సర్వ సామాన్య సూత్రంగా నిర్వచించాడు.

## 10. అళికనేత్రం :-

కాళిదాసు కుమారసంభవం 8 వ సర్గలో పార్వతీ పరమేశ్వ రుల కేళీవిలాసాలు వర్ణించాడు. ఆ వర్ణనను బట్టే ఖజురాహో (ఖర్జూర వాటి) శిల్పాలు మలచబడ్డాయేమోననుకుంటాను శివుడు రహస్య కేళిలో పార్వతి వంటిమీది వస్త్రాన్ని లాగి పారేశాడు. ఆమె సిగ్గుతో ఏమి చేయడానికి తోచక, రెండు చేతులతోను ఆయన రెండు కన్నులూ మూసివేసింది. కాని శివునికి మూడో కన్ను వుంది. దానితో ఆయన చూచాడు. తన నగ్నత్వం కప్పిపుచ్చుకోనడానికి తను చేసిన ప్రయత్నం వ్యర్థం కావడంవల్ల ఆవశురాలై ఉండిపోయింది పార్వతి.

"శూలినః కరతలద్వయేన సా
సన్నిరుధ్య నయనే హృతాంశుకా,
తస్య పశ్యతి లలాటలోచనే
మోఘ యత్న విధురా రహ స్యభూత్." (8-7)

గాథాసప్తశతికవి ఈ సందర్భం మరీ చక్కగా వర్ణించాడు. రతికేళిలో శివుడు పార్వతి చీర ఒలిచివేశాడు. ఆమె సిగ్గుతో అతని రెండు కండ్లూ రెండుచేతులతో మూసింది. మూడో కంటిని ముద్దుతో మూసింది.

"రఇకేళీ హిఅ ణిఅంసణ కరకిసలఅ రుద్ధణఅణ జుగలస్స,
రుద్దస్స తఇఅ ణఅణం పవ్వఇ పరిచుంబిఅం జఅఇ." (5-55)

[రతికేళీ హృత నివసన కరకిసలయ రుద్ధ నయన యుగళస్య,
రుద్రస్య తృతీయనయనం పార్వతీ పరిచుంబితం జయతి.]

కాళిదాసు పార్వతిని దిస్సమొలగానే ఉంచదలచాడు గనుక, ఈ గాథలోని అళిక నయన చుంబనాన్ని వదిలి, తక్కినది గ్రహించాడు; యథాతథంగా.

11. బలాకాపంక్తి :-

వర్షాకాలంలో కొంగలు బారులు కట్టి ఎగురుతుంటాయి, దానిని గాథా సప్తశతి జానపద కవి కాలుడనే కార్తాంతికుడు మొయిలు కప్పిన గగనంలో గ్రహగతి తెలియక లెక్కలు కట్టడానికి పలకమీద గీచిన హోర-గీతలాగ ఉందన్నాడు.

"కత్థ గఅం రఇబింబం కత్థ పణట్ఠాఓ చందతారాఓ,
గఅణే బలాకా పంతిం కాలో హోరం వ కట్టేఇ." (5-85)

[కుత్ర గతం రవి బింబం కుత్ర ప్రణష్టాః చంద్ర తారకాః,
గగనే బలాకా పంక్తిం కాలో హోరా మివా కర్షతి.]

ఈ కొంగల బారును కాళిదాసు స్వీకరించాడు. "ఓ మేఘుడా, నీ ప్రయాణానికి మంచి శకునా లవుతున్నాయి. అనుకూల వాయువులు నెమ్మదిగా వీస్తున్నాయి. నీ సజాతి అయిన అందమైన చాతకం తియ్యగా కూస్తూంది. కొంగలు బారులు కట్టి ఎదయ్యే కాలమనే సంతోషంతో ఎగురుతూ, కనుల విందుగా నిన్ను చూస్తాయి.

"మందం మందం నుదతి పవనః చానుకూలోయథా త్వాం
వామ శ్చాయం నదతి మధురం చాతక స్తే సగంధః,
గర్భాధాన క్షణ పరిచయా న్నూన మాబద్ధమాలాః
సేవిష్యంతే నయనసుభగం ఖే భవంతం బలాకాః"

(మే. పూ. 9)

కాళిదాసు గ్రామసీమల సహజ వాక్కయిన జానపద కవితాపుంజం గాథా సప్తశతి నుంచి బలాకా పంక్తిని తీసుకొని మరింత మధురంగా చిత్రించాడు.

12. సోపానం:-

కాళిదాసు కుమార సంభవంలో పార్వతీదేవి నడుమును వర్ణిస్తూ, పొట్టమీద ముచ్చటయిన మూడు ముడతలను నవయౌవనం దేహంమీదికి అధిరోహించడానికి మన్మథుడు పెట్టిన నిచ్చెనవలె ఉందని ఉత్ప్రేక్షించాడు.

"మధ్యేన సా వేది విలగ్న మధ్యా
వళిత్రయం చారు బభార బాలా,
ఆరోహణార్థం నవయౌవనేన
కామస్య సోపాన మివ ప్రయుక్తం." (1-39)

ఈ నిచ్చెన-సోపాన పంక్తి-గాథాసప్తశతి నుంచి గ్రహించిందే. బంగారు తీగవంటి యువతి, ఏ కారణంగానో చెమర్చింది. ఆ చెమట పొట్టమీద ముడుతలలో మరీ ముత్యాల కడ్డీలలాగ కనిపిస్తున్నది. దానిని కవి ఉత్ప్రేక్షిస్తాడు-లోపలి లావణ్యం, దేహం తీగలాగ సన్ననిది గనుక ఉండలేక పైకి పొట్టమీది ముడుతలు-త్రివళి-అనే మెట్లనుంచి వెలుపలికి దిగివస్తున్నదా-అని.

"సేఅచ్ఛలేణ పేచ్ఛహ తణుఏ అంగమ్మి సే అమాఅంతమ్,
లావణ్ణం ఓసరఇవ్వ తివళిసోపాన పత్తీఏ." (3-78)

[స్వేదచ్ఛలేన పశ్యత తను కేంగే తస్యా అమాత్,
లావణ్యా మపసరతీవ త్రివలీ సోపాన పంక్తిభ్యః.]

గాథాసప్తశతి త్రివళీ సోపానపంక్తి లావణ్యాం లోపలినుంచి వెలుపలికి దిగిరావడానికి వేసింది, కాళిదాసు దీనిని నవయౌవనం పైకి ఎక్కడానికి ఉపయోగించాడు మరింత సుందరంగా.

## 13. దీపశిఖ :-

రఘువంశంలో ఇందుమతీ స్వయంవర ఘట్టం. సూపర్ బజారులో వస్తువులను చక్కగా అమర్చినట్టు, దేశంలోని రాజులందరూ స్వయంవర మండపంలో ప్రదర్శన వస్తువులుగా అసీనులై వున్నారు. ఇందుమతిని సునంద అనే పరిచారిక ప్రతి రాజువద్దకు పిలుచుకొని వెళ్లుతుంది. ఇందుమతి సంచారిణి అయిన దీపశిఖవలె-నడదీపంపలె-ఏ రాజు వద్దకు వెళ్లిందో ఆ రాజు అప్పుడు ఉత్సాహంతో వెలిగాడు; ఆమె అతనిని దాటిపోగానే నిరుత్సాహంతో నల్లబడిపోయాడు. రాత్రిపూట రాజమార్గంలో దీపం చేతబట్టుకొని ఎవరైనా నడుస్తున్నప్పుడు, ఆ దీపకాంతి పడిన మేడో, అంగడో క్షణంసేపు వెలుగుతుంది. ముందుకు పోగానే నల్లగా కనిపిస్తుంది, చీకట్లో-అని కాళిదాసు నరేంద్ర మార్గాట్టంతో పోల్చాడు రాజులను: ఇందుమతిని నడదీపంతోను. ఈ అపూర్వమైన పోలికతోను, ఇతరత్ర దీపాన్ని వర్ణించడంతోను కాళిదాసుకు 'దీపశిఖా కాళిదాసః' అనే ఖ్యాతి వచ్చింది.

"సంచారిణీ దీపశిఖేన రాత్రౌ
యం యం వ్యతీయాయ పతింవరా సా,
నరేంద్ర మార్గాట్ట ఇవ ప్రపేదే
వివర్ణభావం స సభూమిపాల." (రఘు. 5-67)

కాని, ఈ ఖ్యాతికి మూలాలు గాథాసప్తశతిలో ఉన్నాయి. దానిలో దీప వర్ణనలు వివిధవిధాలుగా వున్నాయి. దుర్మార్గుణ్ణి మనం స్నేహంతో, వస్తువుల ఈవితో ఎంత ఆదరించినా సరే దీపంలాగా వున్న యింటినే నల్లబరుస్తాడు (2-85). ఒక యిల్లాలు సందె దీపం పెడుతున్నది భర్త వ్యాపారం కోసం విదేశం వెళ్ళాడు. భర్త జ్ఞాపకం వచ్చాడు కళ్లు కన్నీటితో నిండి ధారకట్టాయి. ఆ కన్నీటితో దీపం ఆరిపోతుందేమోనని ముఖం అటు తిప్పి దీపం పెడుతున్నదట (3-22). ఒక ప్రియుడు ప్రియురాలిని సమాధానపెట్టడం

కోసం ఆమె కాళ్ళమీద పడ్డాడు గత్యంతరం లేక. అక్కడ దీపం మినుకు మినుకు మంటూంది. ఆ ప్రియురాలి చెలికూడ వుంది. "చూచావా నా సౌభాగ్యం. ఇంకా బాగా చూడు" అన్నట్టు ప్రియురాలు దీపపు వత్తిని పైకి ఎగసనదోసింది (8-64). మాంచి యావనంలో వున్నవారు రాత్రంతా వివిధ భంగిమలలో, వివిధ కరణాలతో క్రీడించారు. దీపం దాన్నంతా ఆశ్చర్యంగా చూస్తూ, మానె అయిపోవటం కూడ గుర్తించలేదట (6-47). ఇక ముఖ్యమైన చీకటిలో నడయాడే దీపశిఖ. ఒక అనుభవశాలిని అనుభవం లేక దుడుకుతనం చేస్తూ రాత్రిళ్లు ధైర్యంగా తిరిగే యువతిని మందలిస్తుంది : "అమ్మాయీ, నీకేమో చౌర్యరతమంటే శ్రద్ధ ఎక్కువ. దానికోసమని చీకట్లో తిరుగకు. నీవు పచ్చగా అందమైన దానివి, దీపశిఖవలె-వెలుగుతున్న తిల్లికవలె-గాఢాంధకారంలోను బాగా అందరి కండ్లబడతావు!" అని.

> చోరిఅరఅ సద్ధాలుఇ మా పుత్తి బ్భమసు అంధఆరమ్మి,
> అహిఅఅరం లక్ఖిజ్జసి తమ భరిప దీపసీహావ్వ". (5-16)
>
> [చౌర్యరత శ్రద్ధాశీలే మా పుత్రి భ్రమాంధకారే,
> అధికతరం లక్ష్యసే తమోభృతే దీపశిఖేవ.]

చీకటిలో దీపశిఖవలె కనిపిస్తావు, వెళ్ళవద్దు, అన్న పైగాథలోని భావం సంచారిణి దీపశిఖకు మూలమయి వుంటుందని సాహిత్యజ్ఞుడెవడైనా గ్రహించవచ్చు.

ఈ దీపశిఖను కాళిదాసుకు సమకాలికుడైన సేతుబంధకారుడు కూడ వాడినాడు.

## 14. సత్పురుషులు :

శాకుంతలం పంచమాంకంలో దుష్యంతుని ప్రశంసించే ఘట్టం : చెట్లు పండ్లబరువుతో వంగుతాయి. బాగా నీరు నిండిన

మేఘాలు క్రిందకి వ్రేలాడుతాయి. అలాగే ఐశ్వర్యం వచ్చినప్పుడు గొప్పవారు గర్వపడరు. ఇది పరోపకారుల స్వభావం- అని ప్రశంస ఈ భావంలో కొంత గాథాసప్తశతినుంచి గ్రహించబడింది.

"భవంతి నమ్రా స్తరవః ఫలోద్గమైః
నవాంబుభిః దూర విలంబినో ఘనాః,
అనుద్ధతాః సత్పురుషాః సమృద్ధిభిః
స్వభావ ఏవైష పరోపకారిణామ్."

గాథాసప్తశతిలో సత్పురుషుల ప్రశంసా సందర్భంలోనే ఇలాటి గాథ వుంది.

"ఫలసంపత్తీఇ సమోణఆఇ తుంగాఇ ఫ్ఫల విపత్తీఏ,
హిఅఆఇ సువురిసాణం మహాతరూణాం వ సిహారాఇ."(3-82)

ఫల సంపత్త్యా సమవతాని తుంగాని ఫల విపత్త్యా,
హృదయాని సుపురుషాణాం మహాతరూణాం చ శిఖరాణి.

పెద్ద మానులు పళ్ళు నిండుగా వున్నప్పుడు వంగి వుంటాయి. పళ్ళు లేనప్పుడు పైకి లేచి వుంటాయి. గొప్పవారి మనసులుకూడ ఐశ్వర్యకాలంలో వినయంగా వుంటాయి. ఐశ్వర్యం లేకపోయినా నీచపు పనికి పాల్పడక ఉన్నతంగా వుంటాయి.

ఈ భావం కాళిదాసు శ్లోకంలోని మొదటి, మూడవ పాదాలకు మూలం కావచ్చు ననడంలో ఎవరికీ అనుమానం వుండదు.

ఇవేకాక విరహాతురాబద్ధ, విరహశయన, కంటకితకపోల గోత్రస్ఖలన, మంగళకలశ, కుడ్యలేఖన, గృహద్వారతోరణ, ఏకవేణి, నవమాలిక, అంగణ (మందార) వృక్ష, ముఖ విధ్మాపన మొదలయిన పదబంధాలను, భావాలను కాళిదాసు గాథాసప్తశతి నుంచి గ్రహించాడు.

ఇక దోహద ప్రక్రియలకు-అశోకదోహదం, కురవకదోహదం మొదలయిన వాటికి గాథాసప్తశతికి ముందున్న సాహిత్యంలో ఆకారం కనిపించదు. అథర్వవేదంలోను, వృక్షాయుర్వేదంలోను దీని ప్రశంస కొంత వుంది. కాని ప్రాకృత జానపద సాహిత్యంలో- ముఖ్యంగా గాథాసప్తశతిలో ఈ దోహద క్రియలు కోకొల్లలు. వీనిని కాళిదాసు మొదలయిన రాజరంజక కవులు గ్రహించి వుంటారు.

భావుకతకు, సహజ సుందర భావ ప్రకటనకు ప్రతి దేశపు కవులూ, నేడూ, జానపద ప్రజారంజక కవుల వైపు అరుగ్రులు సాచుతున్నారు. ఆ కాలంలోను ఇది సంభవించింది. అజ్ఞాత జానపద కవులకు రాజరంజక కవులు ఎంతగా కృతజ్ఞులై వుండాలో ఊహించలేము. కాళిదాసూ దీనికి అపవాదం కాదు.

(వరంగల్ స్నాతకోత్తర విద్యాకేంద్రంలో 1974 మార్చి 22, 23 తేదీలలో చదివిన ఎక్స్టెన్షన్ ఉపన్యాస వ్యాసాలలో రెండవది.)

# వాడని వీడని మూడు కోణాలు

గాథాసప్తశతి తెనుగుగడ్డపై వెలసిన కవితాకదంబం; తెలుగుజాతిని వెలయించిన కవితాకదంబం. దీనిలో తెలుగునాడు ఆటవికుల జీవితాలను స్పృశించే ముక్తకాలూ ఉన్నాయి. అలాంటి గాథల భావాలతో అల్లిన ఒక శబరుని కుటుంబజీవితం ఇది.

కుమారుడూ, తల్లి, కోడలు—వీరు ముగ్గురూ ఎడతెగని మూడు కోణాలు. ప్రేమకూ అధికారానికీ అనాదిగా జరుగుతున్న సంఘర్షణ ఈ ముగ్గురిదీ. ఈ శబరుని కుటుంబంలో ముగ్గురూ ప్రేమనిండిన మనం కలవారే. కాని ఏదో అడ్డుతగులుతూ, అహంకారానికి దెబ్బతగిలిస్తూ ఉంటుంది.

సవరి :

దుఃఖపడకుండా ఎలా ఉండగలనో చెప్పండి. అంతటి పరాక్రమవంతుని కుమారుడు గదా! పల్లెమధ్యన తన వికట కోదండాన్ని చెక్కుతుంటే—అందులోనూ ఎలాంటి అవసరమూ లేకుండా చెక్కుతుంటే—ఏమి చేయను దుఃఖపడకుండా? పల్లెపెద్ద మాయింటి మగవాడు మడిసిన నాటికంటె హెచ్చు దుఃఖం కలిగింది.

ఆనాడు మాయింటి మగవాడు కన్ను మూస్తూ మూస్తూ ఏమని చెప్పాడు? "నాయనా, నా పేరుతో నీవు సిగ్గుపడకుండా చూచుకో" అనలేదూ? ఆయన ఎలాంటివాడనుకున్నారు? ఒక్కసారి దొంగలభయంతో అందరూ పల్లెపదలి వింధ్యపర్వతం ఎక్కుదామనుకున్నారు. తన బొందిలో ప్రాణం ఉండగా, ఆలాంటి మాటలు తన చెవిని పడరాదన్నాడు.

అతనికి ఏనుగుల వేటంటే ఎంతో ఇష్టం. అతనిని చూచి ఏనుగులు ఘీంకరిస్తూ పారిపోయేవి; మదించిన ఏనుగులయినా సరే.

కనుకనే అతనిని మత్తగయిందుడు, గయదేవుడు అనేవారు. మాయింటి మగవాడి పరాక్రమంసంగతి ఖారవేల్ల మహారాజుల వారికి తెలిసింది. ఎంత ఆనందించారో! పండి అన్నయ్యా, ముద్దయ్య మావా, రామయ్యబావా ఎంత ఆనందంతో నాకు ఖారవేల్లులవారి అనుగ్రహం తెలిపారో!

అలాంటివాడు ఒకనాడు ఏనుగున వేటకు వెళ్లాడు. వేట కొన్నాళ్లపాటు సాగుతుంది కదా అని, త్వరలో తిరిగి రాకపోతానా అని, పుట్టింటికి వెళ్లాను. మూన్నాళ్లుఉండి తిరిగి వస్తున్నాను దారి లోనే నామతి మతిలో లేదు ఏనుగుల మదజలవాసనలు గుప్పు మన్నాయి. వెంటనే మద గజాలు గండస్థలాలు రాచుకున్న కాను గమానులూ కనిపించాయి. ఏనుగులకు ఇంతధైర్యమా? ఏదో అనాహూతం జరిగిందనుకున్నాను. నా అనుకోడం నిజమే అయింది. పల్లె చేరేవేళకు చావుబ్రతుకుల్లో ఉన్నాడు. ఏ యేమరుపాటున ఉన్నాడో! యూథనాథగజాలన్నీ ఒక్కుమ్మడిగా కుమ్మినట్టున్నాయి.

ఇప్పుడేమో ఆ మత్తగయిందుని కుమారుడు సవరసత్తి స్థితి యిది! కోడలు సోకుంథ సౌభాగ్యానికి నాకు అసూయ అనుకుంటా రేమో! ఎంతమాత్రమూ కాదు. దానిది అదృష్టమే. కనుసన్నల్లో మెలిగే మొగుడు. రూపయౌవనంతో మదించిందాయెను. నా కొడుకు మొదటి విల్లు ఎత్తి ఎక్కుపెట్టలేనప్పుడు ఏమిచేస్తుంది చెప్పండి, చెక్కక? చెక్కి చెక్కి తన సౌభాగ్యాన్ని వీథికి విరజిమ్మి నట్లు విరజిమ్ముతున్నది ఆ చెక్కిన ధూళి. సుడిగాలికి దాని సౌభాగ్య ధ్వజపతాకలాగా మింటికి ఎగిరింది. కోడలు మొదట కాపురానికి వచ్చినప్పుడు చూడాలి మావాడు మరీ చిక్కిపోయి దురాకర్షమై నప్పటికీ వింటిని మోసుకుని వేటకు వెళ్లేవాడు. ఒక్క అమ్ముతో పిడి ఏనుగులకు వైధవ్యం కలిగించేవాడల్లా కోడలి ఒక్క కడగంటి చూపుతో కరిగిపోయి — ఒక్కబాణం మాత్రం తీసుకొని వెళ్లే వాడల్లా — బాణకరండమే మోసుకుపోతున్నాడు. ఇంత ఎందుకు? ఇంకా దాని చనుకట్టు కుదురుకట్టి పెరిగీ పెరగక మునుపే వీడు వెర్రెత్తిపోవడం చూచి అమ్మలక్కలు చెక్కులు నొక్కుకునే

వారట. దాని చనుకట్టు పెరిగిన కొద్దీ దాని నడుమూ సన్నబడింది, మావాడూ సన్నబడ్డాడు. ఏం చేయను తల్లీ, ఏం చేయను? మావాడు తన తండ్రిపేరు ఎలా నిలబెడుతాడో!

*　　*　　*　　*

సోఖుంభ :

అబ్బబ్బ! ఎప్పుడూ వేట! వేట! ఏం వేటో!! ఏమి ఈ ఎడబాటో!! ఆయనను తలచుకుని కళ్లుమూసుకుంటే ఒళ్లు పులకరించి కడిమి చెట్టే అవుతుంది. ఈ ఎడబాటు! ఇది సహించరానిది; ఇది వైద్యుడు లేని వ్యాధి; దరిద్రంవచ్చి అయిన వారిమధ్యన ఉండటం వంటిది; కానివారి కలిమి చూడటం వంటిది. ఏదిక్కు చూచినా, దిక్పాలకులు నిలబడ్డట్లు అతనిరూపే కనులబడుతుంది.

ఆనాటి ముచ్చట ఇంకా మరచిపోలేను. నన్ను పట్టుకుని దొంగలు లాక్కుపోతున్నారు. ఇంతలో పిడుగుపాటులాగ అల్లెతాటి ఝుంకారం వినిపించింది. 'ఎవరో మహావీరుడు వస్తున్నాడు. భయం లేదు' అని తోటి బందీలకు కూడా ధైర్యం చెప్పాను. కాని, ఆధ్వని అకాల జలదగర్జితమని నన్ను ఆబందీలు వెక్కిరించారు. ఇంతలో ఎలా వచ్చాడో, వచ్చాడు—అప్పుడే గిల్లిన మామిడిపూగుత్తి వెంట బడే కొదమతుమ్మెదలాగ వచ్చాడు. ఆయన వచ్చాడో లేదో దొంగలు కాలికి బుద్ధి చెప్పారు.

'ఇక వెళ్లండి. ఎందుకు ఆలస్యం? ఎందుకీ మంద గమనం?' అన్నాడు. చంద్రలేఖలాగ నా పెదవులపై లీగనవ్వు సాగింది. పల్లె వైపు కదిలాము. సైంధవలవణ పర్వతాలలాగ, దూది పింజల పుంజాలలాగ శరత్కాల మేఘాలు ఆకాశంలో పరుగెత్తుతున్నాయి. దారి, పైకి కొంచెంగా ఆరి, లోపల కొంచెం మెత్తగా ఉంటూ, అడుగు వేస్తూంటే పాములాగ ఊపిరి విడుస్తున్నట్లు ఉంది. రేగు రెమ్మ అందించాడు. చెవిలో చెక్కుకున్నాను. ఎంతో మురిసి పోయాను. ఇంతలో ఇల్లు సమీపించింది. ఇంట్లో శేఫాలికా పుష్పాల

గంధం ఊరికే ఉండనిచ్చిందా? నా ప్రియుడు నిత్యరమణీయుడు; చూస్తే కనులు చల్లబడుతాయి. తలచుకుంటే మనస్సు చల్లబడుతుంది. మాటలువింటే చెవులు పోయిపడుతాయి.

నా మనోరథం నెరవేరింది. ఆయన పల్లెకు కాపురం వచ్చాను. కొండమీదిపల్లె. ఎంత అందంగా ఉందో! చుట్టూ దట్టమైన నీడలచెట్లూ, గాలికి వంగి రాచుకుని కీచుమనే వెదురు వనాలూ, ఒళ్లంతా పూచిన కడిమిచెట్లూ: కడిగి తుడిచినట్టున్న కొండమీది బండలూ, హోరుమని పారే సెలయేళ్లూ, వాటి సరసన నాట్యమాడే నెమళ్లూ—ఆ ఊరివారు ఎంత ధన్యులు!

అత్తయ్య సవరి ఎంతమంచివారో! కన్న తల్లి మనసు. "గోదావరి గట్టుకు వెళ్లకమ్మా, పాడుగట్లు శీలం కూలుస్తాయి" అని హెచ్చరించారు కాపుగానికి వచ్చిన మొదట్లో. మంచి చెడు, దుఃఖం సుఖం తెలుసుకుని ప్రవర్తించేవారే ఆడవారు, తక్కినవారు పురుషునికి జరవంటివారు; అని హితపు చెప్పారు. తక్కిన పనులన్నీ మాని నన్ను తమకొడుకు సంజీవనౌషధిలాగ కాపాడుతున్నారు.

"అమ్మాయీ, మనం ముత్యాలు వదలి గురువిందలు గొప్పవనుకుంటామనే ప్రథే ఉంది. అలాగ చేయకు. ముత్యాల హారాలు వేసుకో, యమునానది తరగలపై నురగలు కదలినట్లు ఉంటుంది" అన్నారు. తల వంచుకున్నాను. ఒక మారు ఎర్రమట్టి—మొక్కలు నాటడం కోసం—తోడి చేతులు కడుక్కుంటున్నాను. "ఎందుకమ్మా, అంతగా కడుగుతావు? పగడాల తీగల వంటి వేళ్ల రంగు గదమ్మా అది!" అన్నారు. నవ్వు కున్నాను. ఒకమారు హేమంత మారుతానికి పెదిమెలు పగిలాయి. "లేలేత వేళ్లతో తేనెమైనం పట్టించమ్మా" అన్నారు. మరొక మారు మరీ యిదయింది. గాలికి స్తనాంశుకం పైకి ఎగిరింది. మెడమీద పంటి నొక్కులు కనిపించాయేమో! మదన నిధానాల మూతల వంటి పంటి నొక్కులు మరి! నవ్వుతూ, "ఇలాటివి దాచుకోవాలమ్మా!" అన్నారు. సిగ్గుతో పరుగెత్తాను, లోపలికి.

ఆయనంతూ మరువం మొక్క — సర్వాంగ సురభి. ఒక వసంత కాలారంభం మాట. మామిడి రెమ్మ మోసులెత్తగానే, రాజ ద్రోహం సంగతి చెప్పుకుంటున్నట్టుగా, అందరూ గుస గుసలు పోతున్నారు. మామిడి చిగుళ్ళు కామదేవుని రక్తసిక్త హస్తభల్లాల వలె కనిపించాయి. మరి కొన్నాళ్లకు మామిడి పూతను చిలుకలు ముక్కులతో చిదిమి తింటున్నాయి. చిందిన మామిడి పూత రసంతో వాటి దేహాలు తడిశాయి. ఆ వాసనలకు తుమ్మెదలు ఝుమ్మని మూగాయి. ఒక చోట ఏకాంతంగా ఒక మధుకరం మాలతీ కలిక పై వాలి, కాళ్లతో రేకులు నొక్కిపట్టి, మకరందపానం చేస్తున్నది; రెక్క లల్లారుస్తున్నది ఇంతలో పెదవిపై కాటుతో ఆయన కని పించాడు తేనె తెట్టు పిండుతుంటే తేనెటీగ కుట్టిందట, పాపం! మరొక చెట్టు నీడకు వెళ్లాను. "భ్రమరమా, కమలం వదలి, వాసనకు మోసపోయి వెలగపండు కోసం పరిగెత్తావా? బొమ్మలోని లడ్డుకు ఆశపడడమా?" అని దెప్పిపొడిచాను, ఎంత భ్రమ పడ్డాను!

* * * *

సవరసత్తి :

అమ్మకు ఎంత అభిమానం? ఎవరో చుక్కలయిర్రి చర్మం కోసం వచ్చారట. "మావాడు జింకలపై విలువంచి చేయి చేసుకోడు. పక్కింటి పొరుగింటి సవర యువకులను అడగండయ్యా!" అని పంపి వేసిందట. ఆమెకేమో నేను మదగయిందనాయకుని వీరపుత్రుడని పించుకోవాలనే తమకం. నేను ఏమి చేయను? ప్రేమ విషంలాగ విషమవుతుందంటారు. ఏనుగు తలలోని ఆణిముత్యాల దండల వంటి వేవీ లేక సిగలో నెమలికన్ను తురుముకొని, గర్వంగా తల యెత్తి నిలుచున్న ఆ బందీని చూచినప్పటినుంచి ఈ విషం ఒళ్లంతా వ్యాపించింది. దిగడమే లేదు. ఇప్పుడు ఎవరు ఏమంటే, ఏమి లాభం?

మదనాగ్ని ధూమంలాగ, మదనుడనే మంత్రగాని చేతి మోహన పింఛంలాగ, యౌవన విజయపతాకలాగ ఉన్న ఆమె వాసనలు వెదజల్లే తలకట్టు, మధూక కుసుమాల వంటి కపోలాలు, వాటి

లావణ్యాన్ని వంగి తాగుతున్నట్టున్న కర్ణావతంసాలు, మన్మథుని నిధుల వంటి పాలిండ్లు, సోగకన్నులు—

కన్నులంటే జ్ఞాపకం వచ్చింది: ఆనాడు జింకల జంటపై విల్లెక్కుపెట్టాను. పెంటిలేడి పోతులేడిని ఆశతో చూచింది. చేతిలోని విల్లు జారిపడింది. మరొక మారు, అడవికి నిప్పంటుకుంది. అడవంతా ఎర్రబారింది. మంటల వెలుగుకు. అక్కడున్న జింకలు మోడుగువనం పూచింది కాబోలు ననుకున్నా యేమో — అక్కడి నుండి కదలలేదు. ఎంత అమాయకత్వం! మరొకమారేమో, నా బాణం పెంటి జింకకు తగిలింది. తన సైదోడు ఎక్కడ కనుమరుగవుతాడో అని మోర తిప్పి తిప్పి చూచింది; కటికవాడు లాక్కుపోయే బర్రె చూపులు జ్ఞాపకం వచ్చాయి. నా మనసు నీరైంది. ఇంకొకసారేమో, ఒక జింకల జంట పరస్పరం రక్షించుకొనడానికి ఒకదాని ముందు మరొకటి నిలబడ సాగినవి. నా కళ్ళు చెమర్చాయి. విల్లు దించివేశాను.

వర్షాకాలం వచ్చింది. కారుమబ్బులు ఏనుగు గున్నల్లాగ వింధ్యగిరి చరియలను ఎక్కుతున్నాయి సూర్యబింబం మరుగయింది. కొంగలబారు కాలపురుషుడు కాల నిర్ణయం కోసం ఆకాశాన గీచిన తెల్లటి గీతలాగ కనిపిస్తున్నది. జలధారలనే పగ్గాలు కట్టి భూమిని ఎత్తదలచిన మేఘుడు ఎత్తలేక మూలిగినట్టు ఉరుములు వినిపించ సాగాయి గిరిపతనం చేసినవాని జీవాలలాగ కొండల్లపైని మేఘాల లోని మెరుపులు ధుక ధుక లాడుతున్నాయి. ఇంద్రధనుస్సు దెబ్బ తగిలిన మేఘమనే మహిషం కడుపులోనుంచి వేలాడుతున్న పేగుల్లాగ ఉన్నాయి మెరుపులు. మదగజాలు గోదానది గట్టును తొండంతో కొట్టి, కొమ్ములతో కోరాడుతున్నాయి. ఒకచోట ఒక మగ ఏనుగు బురదలో చిక్కుకున్నది. పిడి ఏనుగు దానిని పైకి తీయడానికి తొండం అందిస్తున్నది; చుట్టూ తిరుగాడుతున్నది మరొక చోట ఒకఏనుగు ఎంతో ఆకలి గొన్నా, తన వల్లభను స్మరించి, మింగబోయిన తామర తూండ్లను తొండంలోనే పెట్టుకుంది. ఇదంతా చూచి, నిర్విణ్ణుణ్ణై ఇంటిముఖం పట్టాను. ఇంటి కంచెపై కాకులు

వానకు ముద్దయిపోయి, రెక్కలు వేలాడుతూ, మెడలు కుంచించుకొని, శూలమెక్కించిన వాటిల్లా కనిపించాయి. వర్షాకాలం నన్ను చూచి పూచిన కొండమల్లెలతో వికట్టాహాసం చేసింది.

సోకుంభ వాకిట్లో వీడిన కొప్పుతో నిలబడి నిండుచూలాలు వంటి నింగిని చూస్తున్నది. మేఘాలవైపు చూశాను; ఆమెవైపు చూచాను-ఏమిటి కోరిక అన్నట్టు. నావైపు కళ్ళు తేల వేస్తూ చూచింది. కంచె ఆవల వరాహి గుర్రుమన్నది. ఏమిటి దీని ధైర్యం! కొడుకు పుట్టగానే ఎంత ధైర్యం వస్తుంది ఈ ఆడజాతికి!-అన్నాను. నిట్టూరుస్తూ నవ్వింది సోకుంభ.

మా ఇద్దరినీ చూస్తూ దీపం కూడా నిశ్చలంగా ఉండిపోయింది. ఒకరి నొకరు క్రీగంట చూచుకున్నాము. చూపులు కలిశాయి. ఒకేమారు నవ్వు మొలకెత్తింది.

# ప్రాకృత సాహిత్యంలో సామాన్య మానవుడు

"సంస్కృతం ప్రకృతి. దాని నుంచి పుట్టింది ప్రాకృతం. ప్రాకృత భాషకు సంస్కృత శబ్దం ప్రకృతి" [1]అని వాచస్పత్యకారుడు చెప్పే వ్యుత్పత్తికాని, "సకల జగజ్జంతువులకు వ్యాకరణాది సంస్కారం లేని సహజ వాగ్వ్యాపారం ప్రకృతి; దానివల్ల కలిగి నదిగాని, అది గాని, ప్రాకృతం. ప్రాకృతం బాలురకు, మహిళలకు సుబోధమయినది, సకల భాషా నిబంధనభూతమయిన పలుకు. అది మేఘాలనుంచి పడిన నీరు వంటిది. అది దేశ విశేషాన్నిబట్టి, సంస్కారాదులనుబట్టి విశిష్టతను పొంది, సంస్కృతాదులుగా తర్వాత విభేదాలు పొందుతుంది" [2] అని రుద్రట రచిత కావ్యాలంకారాన్ని వ్యాఖ్యానించిన నమిసాధువు చెప్పిన వ్యుత్పత్తికాని నాకు అంతగా నచ్చడంలేదు. సంస్కృత ప్రాకృతాలలో ఏదీ ఒకదానినుంచి మరొకటి పుట్టలేదు. ఇవి రెండూ ఒక పూవు కింది రేకు, పై రేకని; కాదు, ఒక రేకు కింది, పై భాగాలని, ఒక నాణెం రెండువైపులని, ఒక కత్తి రెండు పక్కలని నమ్మేవారిలో నేనొకణ్ణి. సంస్కృతం పాకృత భవమని, సామాన్య జనుల భాష అయిన ప్రాకృతం సంస్కరింపబడి సంస్కృతమయిందని అనేవారు మానవజాతి తొట్టతొలి ఛందోరూపమైన - రూపమని అనేకులు విశ్వసించే ఋగ్వేదం తొలి మండలం తొలిఋక్కు,

"అగ్ని మీళే పురోహితం
యజ్ఞస్య దేవ మృత్విజం
హోతారం రత్న ధాతమం"

వంటి దానిని ఒక్క ప్రాకృత గాథ నయినా చూపవలసి వుంటుంది. అప్పటివారు, ఋగ్వేదకాలంవారు మాట్లాడిన, సామాన్య వ్యవహారం

చేసిన భాష ఏదో మనకు స్పష్టంగా తెలియకపోయినా, ఛందోబద్ధమయిన ఋగ్వేదం కొంత మేధావుల భాష అయి సామాన్య ప్రజల భాష అంతకన్నా భిన్నంకాక చాల సన్నిహితమయివుంటుందని భావించడానికి అవకాశం వుంది. పిషెల్ అన్నట్టు ప్రాకృతానికి, వైదిక సాహిత్యానికి పోలికలు చాల వున్నాయి :- త్తణ—త్వన, ఆవి—ఆవై, విహీ-పపభిః, హోహీ-భోది, విఊ—విదుః, ఘింసు—ఘ్రుంస, రుక్ఖ-రుక్ష మొదలయినవాటిని ఆయన చూపారు. [8] పై వానిలో మొదటిది ప్రాకృతరూపం, రెండవది వైదిక రూపం. అందువల్లనే ప్రాచీన ఋగ్వేదకాలంనాటి సంస్కృతం, ప్రాకృతం ఒకే పూవు రేకు రెండువైపులని అన్నాను.

కాని, భాష, ఏభాష అయినా, ప్రవాహిని. కనుక ఋగ్వేదపు సంస్కృతం కూడ జనం ముఖయంత్రంలో పడి, మారక తప్పలేదు. ప్రాచీన భాషను పొల్లు పోకుండా కాపాడుకోవాలని నేడున్నట్లే, ఆనాడూ వైయాకరణులు తాపత్రయ పడడంవల్ల వైదిక సాహిత్యంలోని ఋక్కులకు, పనసలకు పద పాఠాలు, ఉచ్చారణ రక్షణకు ప్రాతిశాఖ్యలు పుట్టాయి; కాలక్రమాన వైదిక భాష కేవలం కర్మకాండ భాష కావడంవల్ల నిరుక్తాది నిఘంటువులు పుట్టాయి. అర్థ రక్షణకు శిక్షాదులు పుట్టాయి. "వ్యాకరణం వేదాల రక్షణకు చదవాలి, రూపాగమ వర్ణ వికారజ్ఞుడే వేదాలను చక్కగా రక్షించగలడు" అని పతంజలి హితవు. పాణినికూడా "వేదే లోకే" అని విడదీయడంవల్ల సాహిత్యభాష, లౌకిక భాష వేరువేరయినట్టు స్పష్ట పడుతుంది. మేధావుల మేల్మిభాషకు పోక, తథాగతుడు తన ప్రాంతపు పాళీ భాషతో ధర్మోపన్యాసాలు చేసినట్టు పరిశోధకులు చెబుతున్నారు. ఆ పాళీ భాష ఋగ్వేద బ్రాహ్మణాదుల సంస్కృతాన్ని కొంచెం ఏసతో కొంచెం ముఖయంత్ర సౌలభ్యంతో వ్యవహరించినప్పటి రూపమని ధమ్మపదంలోని మూడు పంక్తులు చూస్తే స్పష్టమవుతుంది;

"యోచ వస్సనతం జంతు అగ్గిం పరచరే వనే
ఏకంచ భావితత్తానం ముహుత్తం అపి పూజయె

సా యేవ పూజనా సేయ్యో యం చే వస్సనతం హుతం."
అందువల్ల ప్రాకృత సంస్కృతాలు రెండూ ఒక నాణెం రెండు వైపులని మరొకమారు మనవి చేస్తున్నాను.

భాష ప్రవాహిని గనుక ఈ ప్రాకృతంకూడ మారక తప్ప లేదు, దీనిలోను సాహిత్య సంస్కారం గలది పై సాహిత్యమై, తక్కినది అపభ్రంశమయింది. ప్రాకృతమే అపభ్రంశమని కావ్యాలంకార వ్యాఖ్యాత నమిసాధువు దబాయించి చెప్పినా, ⁶ ఆ అపభ్రంశ పాకృతమూ దేశ భాషలుగా వేయి చీలికలయింది. ప్రాకృత భాషల చర్చ నా యిప్పటి వివతు కాదు; బౌద్ధ ధర్మ గ్రంథాల జోలికిగాని, జైనాగమ ప్రాకృతం జోలికిగాని నేనిప్పుడు పోను: వాటిలో సామాన్య ప్రజల విషయాలు చాల వుండవచ్చు; కాని, నా ఇప్పటి వివతు సాహిత్య ప్రాకృతమయిన గాథాసప్తశతీ, వజ్జాలగ్గం, సేతుబంధం, గౌడవహో అనే నాలుగు కావ్యాలలో, నగర ప్రసక్తి చాల తక్కువగా వున్న గ్రామీణ సామాన్య మానవుని స్థితిగతులు, జీవిత విధానం ఎలా చిత్రించబడినవో మనవి చేయడమే.

సాహిత్య ప్రాకృతం సాహిత్య సంస్కృతానికి నిజంగా భిన్నం కావడానికి ప్రధాన కారణం సామాన్య మానవుడే నను కుంటాను. సామాన్య మానవుణ్ని ప్రాకృత సాహిత్యం ఆదరించి నట్టు, అభిమానించినట్టు సంస్కృత సాహిత్యం ఆదరించలేదు. మన ఆది కావ్యమయిన రామాయణం కూడా రాజ రంజకమయినదే— అంటే, కోర్టు పొయట్రీ. కనుక ప్రాకృత సాహిత్యం ప్రజారంజకం, ప్రజా విషయకం అనడం పొరపాటు కాదు ఈ దృష్టితో చూచి నప్పుడు గాథాసప్తశతి ప్రజారంజక సాహిత్యంలో అగ్రస్థానం వహిస్తుంది. ఈ గాథాసప్తశతిలో కొంతయినా తెలుగుగడ్డపై వెలసినది. గాథ అంటే ఆర్యావృత్తభేదం. ప్రజారంజక కవులు రచించిన ఈ అమర గాథలను సేకరించి ప్రాకృత సాహిత్య వధువుకు అంద చందాలు కూర్చినవాడు హాలసాతవాహనుడు. హాలుని కాలం క్రీస్తుశకం మొదటి శతాబ్దమని, 68 ప్రాంతంలో వున్నవాడని పండితుల నిర్ణయం. ఇతడు తాను రాజయినా, గ్రామజీవన

సౌందర్యం వెల్లివిరిసే గాథలను సేకరించి ప్రపంచానికే ముక్తకగ్రథనంలో మార్గదర్శకుడయ్యాడు; తెలుగునాని కల్పనా కమనీయతను దిగంతాలకు చాటాడు.

## గాథా సప్తశతి

అప్పటి దృష్టి రసరాజమయిన శృంగారానికి పట్టం కట్టినట్టిది గనుక, ఈ గాథలలో శృంగార రసచ్ఛాయ లేనివి తక్కువే అయినా, ఆ శృంగార రసధునినుంచి తొంగిచూచే సామాన్య మానవుని జీవితం, నేడూ - సామాన్యజనునికి పట్టాభిషేకం చేస్తున్నామని, అభ్యుదయ పథగాములమని చెప్పుకొంటున్న నేడూ- ఆశ్చర్యం కలిగిస్తుంది, ఇంత సామాన్య విషయం, ఇలాటి ఇంటి ముచ్చట్లు కవితా స్థాయికి ఎలా ఎక్కగలిగాయా అని. సామాన్య మానవునికి నా నిర్వచనం ప్రతి వృత్తిలోని సామాన్య గృహస్థులు-రాజసేవకుడు మొదలు నాపితుని వరకు గలవారు. ఈ సామాన్య ప్రజల దైనందిన జీవితం, దారిద్ర్యం, కరువు కాటకాలు, వాగులు వరదలు, వానకాలపు బురదవీథులు, ఎండకాలపు మృగతృష్ణలు, దప్పిగొన్న బాటసారులు. చలివెందలి చపలాతులు, చలికాలపు నెగళ్లు, నెగళ్లు, గొంగళ్లు అక్కరలేని నెరజాణల మొగుళ్లు, వసంతోత్సవాలు, మొగిళ్లను చూచి మూడు నిట్టూర్పులు విడిచే ముదితలు, ఫాలుణోత్సవాలు, పెండ్లిండ్లు, పేరంటాలు, సతులు అసతులు, విధవలు వేశ్యలు, జారులు పూజారులు, వంటలు పంటలు, శిథిల దేవాలయాలు, ప్రశిథిల వలయాలు, నగలూ నాణేలు-ఒకటేమిటి గ్రామాలలోని ప్రతిదీ కావ్య వస్తువయింది. ధర్మశాస్త్రం నిషేధించిన ఋతుమతీ సంస్పర్శన సంగమాలను కూడ ఈ కవులు వదలిపెట్టలేదు. ఈ రమణీయ జీవితానికి దిఙ్మాత్రంగా కొన్ని గాథలను ఉదాహరిస్తాను.

దారిద్ర్యాన్ని చిత్రించడంలో ప్రాకృతకవి నేటి అభ్యుదయ రచయితను కల్పనలో ఎలా మించిపోయాడో ఈ గాథలే సాక్షులు:-

**దుగ్గఅ కుటుంబఅట్టీ**
**కహంణు మఏ ధోఇఏణ సోఢవ్వా,**

దసీఓసరంత సలిలేణ
ఉపహా రుణ్ణంవ పడపణా! గాథాస: 1-18

(దుర్గత కుటుంబాకృష్టిః
కథన్ను మయా ధౌతేన సోఢవ్యా,
దశాపసరత్సలిలేన
పశ్యాత రుదిత మివ పటకేన!)

కటిక దరిద్రం. ఉన్న ఒక్క గుడ్డనూ దినమూ గుంజి పులిమి ఆరవేస్తున్నారు. గుడ్డ చీకిపోయి ఇక ఉండలేననుకుంది. ఆరవేసిన గుడ్డ అంచునుండి నీరు కారుతూంది దానిని కవి - ప్రాకృతకవి చూచాడు. అతని హృదయం కూడా నీరు కారింది. ఈ దరిద్రపు సంసారం గుంజుకొని రావడం ఇక సహించలేనన్నట్టు ఆ గుడ్డ ఏడు స్తున్నట్టు ఉంది అని ఉత్ప్రేక్షించాడు.

దరిద్రుని ఇల్లాలు. వేవిళ్లు వచ్చాయి. వేవిళ్లలో ఎన్నో ఆశలు పుడుతాయి స్త్రీలకు. కాని, భర్త దరిద్రుడు. ఏమి తెచ్చిపెట్టగలడు! కనుక "ఏమి కావాలి?" అని అడగినప్పుడల్లా "మంచినీళ్లు కావాలి!" అనేదట పాపం ఒక బీదరాలయిన చూలింత.

"దుగ్గఅ ఘరమ్మి ఘరిణీ
రక్ఖంతీ ఆఉలత్తణం పఇణో,
పుచ్ఛిఅదోహాల సద్దా
పుణోవి ఉఅఅం విఅ కహేఇ." గాథాస:-5-72

(దుర్గత గృహే గృహిణీ
రక్షంతీ ఆకులత్వం పత్యుః.
పృష్ట దోహద శబ్దా
పున రపి ఉదక మితి కథయతి.)

తాను ఏమి అడిగినా, భర్త తేలేడు. అతని ఆకులత్వం పోగొట్టడానికి పాపం మంచినీళ్లు తప్ప మరొకటి అడుగలేదు, ఆ ఇల్లాలు.

చలికాలం. దరిద్రుడు పిడకల కుమ్ముముందు చలికాచుకొంటు న్నాడు. అతడు కట్టుకొన్న గుడ్డ పిడకలకంపు కొడుతూంది; పొగ

చూరి కావిరంగు ఎక్కి నేత కూడ వదులయిపోయింది. ఎంత దైన్యం! హేమంతఋతువు ఇలా దరిద్రుణ్ని పట్టి చూపుతుంది. అంటాడు కవి.

"సూఇజ్జఇ హేమంతమ్మి
దుగ్గఓ పుప్ఫుఆ సుగంధేణ,
ధూమకవిలేణ పరివిరళ
తంతుణా జుణ్ణవడఏణ." గాథాస: 4-29

(సూచ్యతే హేమంతే
దుర్గతః కరీషాగ్ని సుగంధేన,
ధూమకపిలేన పరివిరళ
తంతునా జీర్ణపటకేన.)

ప్రాకృత కవులు చిత్రించిన గ్రామీణ దృశ్యాలు రాజరంజక కవుల కల్పనలకు అతీతమైనవి. ప్రాకృత ప్రజారంజక కవి తన పరిసర సామాన్య విషయాలను మనోహరంగా అతి సహజమైన ఉపమోత్ప్రేక్షలతో ప్రయత్నపూర్వకంగా గ్రహించదగినట్లుగాక సులభ గ్రాహ్యంగా చిత్రిస్తారు.

"ఫాలేహి అచ్ఛభల్లం
వ ఉఅహ కుగ్గామ దేఉలద్దారే,
హేమంతఆల పథిఓ
విజ్ఝాయంతం పలాలగ్గిం. గాథాస 2-9

(పాటయత్యచ్ఛభల్లం
ఇవ పశ్యత కుగ్రామదేవకులద్వారే,
హేమంతకాల పథికో
విధ్మాయమానం పలాలాగ్నిం.)

ఈ గాథలోని చిత్రం, దాని వర్ణన అపురూపాలు. చలికాలం. పల్లెటూరి దేవాలయం ముందు ఒక బాటసారి గడ్డి నెగడు వేశాడు. చలికి గడ్డినెగడు ఎంతసేపు ఉంటుంది! ఆరిపోతుంది. కాని లోపల నిప్పు ఉంటుంది. కనుక నెగడును కర్రతో కెలుకుతున్నాడు. అది

ఎలుగుబంటిని చీలుస్తున్నట్టు ఉన్నదట. కాలిన గడ్డి మంట ఆరి పోగానే, నల్లగా పెద్దగా రాశివలె కనిపిస్తుంది. కర్రతో కెలికితే లోపల ఎర్రగా నిప్పు కణకణమంటుంది. కవి పొట్ట చీల్చుతున్న ఎలుగుబంటితో పోల్చాడు, దీనిని.

కవితకు ప్రేరకురాలు పద్మినిజాతి స్త్రీయే కానక్కరలేదు; అనుక్షణం మన కట్టెదుట మసలుతూ, ఇంటి పనులలో నిమగ్నురా లయిన ఇల్లాలయినా ప్రేరకురాలు కాగలదని ప్రాకృతకవి సిద్ధాంత మయిఉంటుంది. లేకపోతే,

"రంధణకమ్మ నివుకుణిఏ
మా జూరసు రత్తపాటలసుఅంధం,
ముహమారుఅం పిఅంతో
ధూమాఇ సిహీ ణ పజ్జలఇ." గాథాస. 2-24
(రంధన కర్మ నిపుణికే
మా కృధ్యస్వ రక్తపాటల సుగంధం,
ముఖమారుతం పిబన్
ధూమాయతే శిఖీ న ప్రజ్వలతి.)

అని అనివుండడు. ఇల్లాలు వంట చేయాలి. పొయ్యి రాజవేసింది, పొయ్యి రాజలేదు. నిప్పు మండడం లేదు. భర్త అంటాడు: "వంటల్లో ఆరితేరిన గడసరిదానా, ఊదడం మాను. కోపగించు కోకు. నీ ఊర్పుల కమ్మతావిని ఆస్వాదిస్తూ, అగ్నిదేవుడు మరీమరీ ఆ తావిని గ్రోలుదామని మండడం లేదుసుమా!" అని.

ప్రసూతి వైరాగ్యం, పురాణ వైరాగ్యం, శ్మశాన వైరా గ్యం-అని వైరాగ్యం మూడు విధాలని (తాత్కాలికమయినవి కావడం వల్ల) పెద్దలు హాస్యం చేస్తుంటారు. పురాణం విన్నంత సేపూ మంచి పనులు చేయాలని, ఈ సంసారం రోత అని అనిపిస్తుంది. శ్మశానంలో ఎవరికన్నా దహన సంస్కారం జరుగు తుండడం చూచినప్పుడు, "ఏమిటి ఈ దేహం అనిత్యం, ఎప్పటి కయినామనమంతా కాలి పోవలసినవారమే" అనిపిస్తుంది. కాని,

తర్వాత, ముందులాగే సంసారంలో పడతాము. అలాగే ప్రసూతి వైరాగ్యమూ. స్త్రీలు ప్రసవ వేదన భరించలేక "ఇక మగడు వద్దు, వాడి ముఖం చూడను." అని ఏడుస్తారు. కాని, మళ్ళీ కాపురం సాగుతుంది. ప్రాకృతకవి తమ గ్రామాలలో చూచిన ఇలాటి ఘటనను ముచ్చటగా వర్ణించాడు:- తొలికాన్పు. ఎంత నాగరకురాలయినా భయంగా వుంటుంది ఏమవుతుందోనని. ప్రసవ వేదన భరించలేక "ఇక మగడు వద్దు, చాలు" అని పదేపదే అనడం ప్రారంభించిందట ఒక నవయువతి. అందరూ నవ్వారట.

"హాసావిఅ జణో
సామలీఏ పఢమం పసూఅమాణాఏ.
వల్లహ వాహేణ అలం
మమత్తి బహుసో భణంతీఏ."          గాథాస. 2-26

(హాసితో జనః
శ్యామాయాః ప్రథమం ప్రసూయమానాయాః,
వల్లభవాదేవ అలం
మమేతి బహుశో భణంత్యాః.)

ఇటీవల 45 సంవత్సరాల వయస్సు తర్వాత పెళ్ళాడి కాన్పు వచ్చిన ఒక అధికారిణి, భయపడుతూ ప్రతి తల్లినీ అడిగింది. "ఏమవుతుంది? ఎలా వుంటుంది?" అని. అయినప్పుడు, ఏమాత్రం వైద్యసౌకర్యాలూ లేని రెండువేల సంవత్సరాల క్రిందటి గ్రామాల అర్భకురాలు భయపడడంలో ఆశ్చర్యమేమిటి?

తన భర్తను మరొకజాణ వలచింది. ఈమె నిలదీసింది. ఆమె కాదన్నది. కాని ఈమె ఒప్పుకోలేదు. "నాకు తెలుసు నీ ప్రవర్తన. నీవు రాత్రల్లా నా వానితో కులకకపోతే ఎందుకలా ముర్రిపాలు తాగిన కొత్త గేదె దూడవలె పగలల్లా పడి నిద్రపోతావు?" అని ప్రశ్నించింది, ఈమె.

"జఇ హోసి ణ తస్స పిఆ
అణుదిఅహం ణీసహేహి అంగేహిం,

ణవసూఅ పీఅ పీఊస
మత్త్రాపాడివ్వ కిం సుఅసి?" గాథాస. 1-65

(యది భవసి న తస్య ప్రియా
అణుదివసం నిస్సహై రంగైః,
నవసూత పీతపీయూష
మత్తమహిషీ వత్సేవ కిం స్వపిషి?)

అప్పుడు పుట్టిన పిల్లలు 24 గంటలూ నిద్రపోయినట్లే పశువులదూడలు కూడ జున్నుపాలు తాగి మత్తుగా నిద్రపోతాయి. రాత్రల్లా రతి విలాసంలో అలసిసొలసి పగలల్లా నిద్రమత్తులో వున్న పడతిని ప్రాకృత కవి సహజసుందరంగా తను నిత్యం గ్రామాలలో చూచే కొత్త గేదె దూడతో పోల్చడం రాజరంజక కవికి ఊహాదూరమని నా విశ్వాసం.

పల్లెటూరి మడి కయ్యలలో జరిగే శృంగార నాటకాలను హాలుడు ఎన్నో వరాడు. వాటిలో ఒకటి విశిష్ట మయినది ఇది:- పాలేరుకు, గృహస్వామినికి మనసు కలిగింది. పక్కలను, హంస తూలికా తల్పాలను తలదన్నే మడికయ్యలలోనే మన్మథుణ్ని ఆరా ధించారు. ఆమె ఆనందపారవశ్యంతో చొక్కి కనులు మూసుకుంది. ఎంతసేపయినా తెరవలేదు. పాలేరు వెర్రిబాగులవాడు. యజమాను రాలు చచ్చిపోయిందేమోనని భయపడుతాడు, కాలికి బుద్ధిచెబుతాడు. వాడి వెర్రికి గట్టుమీద అరవిచ్చి వంగిన పత్తికాయ నవ్వింద‌ట, ఆనందంతో వున్న ప్రియురాలిని వదలిపోతున్నాడే అని.

"అజ్జం మోహాణసుహిఅం
ముఅత్తి మోత్తూ పలాఇఏ హలిఏ,
దరవుడిఅ వేంటభారో
ణఆఏ హాసిఅం వ ఫలహీఏ" గాథాస. 4-60

(అర్యాం మోహనసుఖితాం
మృతేతి ముక్త్వా పలాయితే హాలికే,
ఈషత్స్ఫుటిత వేంటభారా
నతయా హాసిత మివ కార్పాస్యా.)

పత్తికాయ కొంచెంగా పగిలినప్పుడు, పగిలిన డిప్పలఅంచులు ఎర్ర గాను, తడి పత్తి వెన్నెలరంగుతోను వుంటాయి. అరవిచ్చిన పత్తి కాయను నవ్వుతో పోల్చినందుకు ప్రాకృత జనరంజక కవికి ఏమి ఇచ్చినా తీరదు. రాజరంజక కవికి ఇలాటిది ఎందుకు తోచలేదో!

ఏతల్లికయినా తన పిల్లడు చేసిన చేష్టలు గొప్పగా కనిపిస్తాయి. ఒక తల్లి పిల్లడికి అప్పుడే పాలపండ్లు వచ్చాయి. ఆ పాలపండ్లతో వాడు రేగుపండు కొరికాడు. ఆ రెండుగాట్లూ ఆమెకు ఏమని పిస్తాయో! అని పించాయో! మహానందంతో భర్తవద్దకు వచ్చింది, "ఇదిగో తీసుకోండి. చూడండి దీనిని." అంటూ నవ్వుతూ పిల్లడు పళ్లతో కొరికిన-క్రొత్తగాపుట్టుకొని వచ్చిన రెండు పండ్లగాట్లున్న-రేగుపండును భర్తకు చూపిందట.

"గేహ్ణాహ పలోఅహ ఇమం
పహాసిఅవఅణా వఇస్స అప్పేఇ,
జాఅ సుఅ పదముబ్భిణ్ణ
దంతజుఅలంకిఅం బోరం." గాథాస. 2-100

(గృహీత ప్రలోకయత ఏనం
ప్రహసిత వదనా పత్యు రర్పయతి,
జాయా సుత ప్రథమోద్భిన్న
దంతయుగళాంకితం బదరం.)

దీనిలో ఒక వైద్యక శాస్త్రరహస్యమూ ఉంది. పిల్లలకు పళ్లు వచ్చే వరకు భార్యా భర్తలు తప్పనిసరిగా శయ్యాపథ్యం చేయాలి. తర్వాత అక్కరలేదనికాదు. అంతలోగా కక్కుర్తి పడరాదని. అందుకనే భార్య భర్తతో "మహా తొందర పడేవారు. ఇక ఫరవాలేదు" అని నవ్వు ముఖంతో చూపడం.

ఏ వస్తువు నన్నా పగ్గంకట్టి పైకి లాగుతామనుకోండి. అది బరువుతో లేవనప్పుడు, అప్రయత్నంగా మన నోటినుంచి కేకలు, ఆర్భాటాలు బయలుదేరుతాయి. వర్షాకాలం పగ్గాలు పైనుంచి విసరి నట్టు వర్షం కురుస్తూంది. ఉరుములు వినిపిస్తున్నాయి. ప్రజారంజక

కవి తమ సహజంగా బరువు లెత్తేవారిని చూచిన దృష్టితో చూచాడు ఈ దృశ్యాన్ని. "మేఘమనే కార్మికుడు సందులేకుండ భూమిని పగ్గాలుకట్టి పైకి లాగుదా మనుకున్నాడు, ఎంతో ప్రయత్నించాడు. లాగలేక పోయాడు. మూల్గుతున్నాడు; ఆ మూల్గులే ఉరుములు" అని వర్ణించాడు.

"అవిరల పడంత ణవజల
ధారా రజ్జు ఘడిఅం పఅత్తేణ,
అపహుత్తో ఉక్ఖేత్తుం
రసఈవ మేహో మహిం ఉవహ". గాథాస. 5-36

(అవిరల పతన్నవజల
ధారారజ్జుఘటితాం ప్రయత్నేన,
అప్రభవ న్నుత్క్షేప్తుం
రసతీవ మేఘో మహీం పశ్యత.)

మనం బలపంతో పలకమీద వ్రాసినది పిల్లలు తుడిచి వేస్తుంటారు. దీనిని ప్రాకృత కవి ఒక జీవిత సత్యానికి అన్వయించాడు. మనసు ఏవేవో కోరికలు కోరుతుంటుంది. మనస్సు ఆశ అనే బలపంతో హృదయమనే పలకమీద ఏవేవో పిచ్చి కోరికలనే గీతలు గీస్తుంటుంది. వాటిని విధి పిల్లవాడివలె నవ్వుతూ తుడిచి వేస్తుంటాడు అని. పిల్లవాడికి ఇతరుల లాభాలాభాలతో ప్రసక్తిలేదు. ఎవరేమి వ్రాసినా పిల్ల చేష్టలతో తుడిచివేస్తుంటాడు.

"జం జం ఆలిహఇ మణో
ఆసావట్టీహిఁ హిఅఅఫలఅమ్మి,
తం తం బాలోవ్వ విహీ
ణిహుఅం హసిఊణ పంహుసఇ." గాథాస. 7-56

(యద్యా దాలిఖతి మనః
ఆశావర్తికాభి ర్హృదయ ఫలకే,
తత్తద్బాలక ఇవ విధిః
నిభృతం హసిత్వా ప్రోంఛతి.)

పిల్లల చేష్టలు, వినోదాలు మనం ప్రతిక్షణంచూస్తుంటాము. ప్రాకృత కవి దానితో ఒక నిత్య సత్యాన్ని అనుసంధించాడు.

వర్షాకాలంలో గ్రామంలోని దారులన్నీ బురదయిపోతాయి. అప్పుడు నడవలేము. కాని, శరత్కాలం రాగానే బురద ఎండడం ప్రారంభిస్తుంది, దారులుపైన ఆరుతాయి. కాని తొక్కితే, పైన నడిస్తే మెత్తగా అణగిపోతూ, ఒత్తిడికి బుస్సుబుస్సుమనే ధ్వని కలుగుతుంది. దానిని చూస్తే, ఎలా వుందంటే, జనం పైన నడయాడుతుంటే, దారులు ఊపిరి వదలుతున్నట్టు వుందట.

"అబ్భంతర సరసాఓ
ఉవరి పవాఅబద్ధ పంకాఓ,
చంకమ్మంత్తమ్మి జణే
సముస్ససంతి వ్వ రచ్ఛాఓ." గాథాస. 7-13

(అభ్యంతర సరసా
ఉపరి ప్రవాత బద్ధ పంకాః,
చంక్రమమాణే జనే
సముచ్ఛ్వసంతీవ రథ్యా.)

మామిడిపండు పూర్తిగా మన దేశంది. బుద్ధుని కాలంలో ఆమ్రవనం, అమ్రపాలీ ఉన్నప్పుడు గాథాసప్తశతిలో మామిడిపళ్ళ ప్రసక్తిని ఏమి తక్కువ? ఊళ్లలో శత్రుపక్షాలుంటాయి. ఒక శత్రుపక్షం వారికోరికను మరొకరుగాని తటస్థులుగాని మన్నించరు. ఇలాటి ఒక శత్రుపక్షానికి చెందిన ఒక మహిళ పుత్రునితోపాటు ఒక చోట ఉంది. అక్కడ ఒక మామిడిచెట్టు. దానిలో ఒకపండు మాగి వేలాడుతూంది. పిల్లవాడు ఆ పండు కావాలన్నాడు. ఏడుస్తున్నాడు. తల్లి దారినిపోయే ప్రతి దానయ్యనూ అడుక్కుంది; "పండు దూరంగా వుంది, అందుకోలేను. పిల్లడు ఏడుస్తున్నాడు, తెంపి ఇవ్వండి" అని. కాని, ఆ పథికులు ఎవరూ తెంపి ఇవ్వలేదు. "ఈమె మన శత్రుపక్షానికి చెందినట్టిది. మన పక్షంవారు ఏమనుకుంటారో!" అని ఇతర శత్రుపక్షంవారు వినకుండా పోయారు. తటస్థులేమో

"మనకెందుకు? ఎవరివాళ్లు వాళ్లకు సహాయం చేసుకుంటారు." అని ఊరుకున్నారు.

"విసమట్ఠియ పక్కే
క్కంబ దంసణే తుజ్ఝ సత్తుఘరిణీప,
కో కో ణ పత్థిఓ పహిఆణం
ఢింభే రుఅంతమ్మి." గాథాస. 6-95

(విషమస్థిత పక్వైకామ్ర
దర్శనే తవ శత్రుగృహిణ్యా,
కః కో న ప్రార్థితః
పథికానాం డింభే రుదతి.)

నీ శత్రు గృహిణి అని కవి చెప్పడంవల్ల ఒకరాజు ప్రస్తావన వుంది. ఇది ఏరాజో పరిశీలించాలి.

ఎంతకాదనుకున్నా పట్టణచ్ఛాయలు దీనిలో లేకపోలేదు. నందుల కాలపు రాజవిప్లవాలు, మరికొన్ని అరాచకాలు కొన్ని గాథ లలో ధ్వనిస్తున్నట్లు కనిపిస్తుంది. గాథాసప్తశతి ఐదవ శతకం 17వ గాథ నందవంశ మూలపురుషుని కథను ధ్వనింపజేస్తున్నదని శ్రీ ఎస్. ఎస్. కృష్ణమూర్తిగారు భావిస్తున్నారు. ఆ గాథ ఇది:

"ఆమ అసఇహ్మ ఓసర
పఇవ్వఏ ణ తుహ మఇలఅం గోత్తం,
కిం ఉణ జణస్స జాఅవ్వ
చందిలం తా ణ కామేమో." గాథాస. 5-17

(ఆమ అసత్యో వయం
అపసర పతివ్రతే న తవ మలినితం గోత్రం,
కింపున ర్వయం జనస్య జాయేవ
నాపితం తావన్న కామయామహే.)

ఔను! మేము లంజలం. దగ్గరకు రాకు, తప్పుకో. నీ వంశం మయిలపడిపోయేని. కాని, మేము సామాన్య సంసారికి భార్యలం.

నాపితుని కామించలేదుగదా!-అని ఈ గాథ అర్థం. నందులకు పూర్వం భారత పాలకులు శిశునాగులు. శిశునాగులలో కడపటిరాజు కాలాశోకుడు. కాలాశోకుని భార్యకు ఆస్థాన నాపితునికి సంబంధం కలిగింది. ఈ నాపితుడు కాలాశోకుని భార్య సహాయంతో, అతనిని చంపి, రాజ్యం ఆక్రమించుకొని నందవంశానికి మూలపురుషు డవుతాడు.[7] వీడిని నాపితదాసుడని కొందరన్నారు. నందులు అధార్మికులని, ఉన్నత కులులు కారని మహావంశం అంటున్నది.

ఇలాంటి రాజకీయ విషయమే మరొకటి ఒకగాథలో సూచితమయింది. వసంతఋతువు వచ్చింది. మామిడికొమ్మ మోసులెత్తింది. పాంథులు భయపడిపోయి ఈ విషయం ఏదో రాజద్రోహ వార్త చెప్పినట్టు గుసగుసగా ఒకరి చెవి మరొకరు కొరుకుతూ చెప్పినట్టు ఉందట.

"రాజవిరుద్ధం వ కహం
పహిఓ పహిఅస్స సాహఇ ససంకం,
జత్తో అంబాణ దళం
తత్తో దరణిగ్గఅం కింపి." గాథాస. 4-96

(రాజ విరుద్ధా మపి కథాం
పథికః పథికస్య కథయతి సశంకం,
యత ఆమ్రాణాం దలం
తత ఈషన్నిర్గతం కి మపి.)

నందుల మూలపురుషుని గాథలాగే ఇది కూడా ఏదో అజాతశత్రువు తన తండ్రికి చేసిన ద్రోహానికి, జనం గుసగుసగా చెప్పుకొన్న దానికి సూచక మయివుంటుందని నా అభిప్రాయం.

వీథిలోని ఆటలు, కుస్తీలు పాకృతకవి దృష్టిని దాటిపోలేదు, అవి సామాన్య మానవుని వినోదాలుగనుక. ఒక ముసలి మల్లుడు ఎన్నో మల్ల యుద్ధాలు చేశాడు. వాటిలో ఎదిరి మల్లులు కొట్టిన దెబ్బలకు అతని చెవులు చిట్లి చితికి బండబారిపొయ్యాయి. అలాటివాడు కాసె బిగించి కుస్తీకి సిద్ధమయ్యాడు. అతని కాసె బిగింపు

చూడగానే ఎదిరి మల్లుని గుండెలు పెల్లగించుకొని వచ్చాయి, భయంతో.

"జుజ్ఝ చవేడామోడిఅ
జజ్జర కణ్ణస్స జుణ్ణ మల్లస్స,
కచ్ఛాబంధో చ్చిఅ భీరు
మల్లహిఅఅం సముక్ఖణఇ" గాథాస. 7-84

(యుద్ధ చపేటా మోటిత
జర్జర కర్ణస్య జీర్ణమల్లస్య,
కక్షా బంధ ఏవ భీరు
మల్లహృదయం సముత్ఖనతి.)

మరొక వీథిలో మల్లుడు తప్పెట కొడుతున్నాడు. మల్లుని భార్య తప్పెట తాళానికి అనుగుణంగా నాట్యంచేస్తున్నది. ఒకతె ఆ మల్లిని-మల్లుని భార్యను - ఎత్తిపొడుస్తుంది. "ఓ మల్లీ, ఎంత దురదృష్టమే నీది! భర్త దప్పుకొడితే ఆడుతావు సిగ్గు లేక!" అని.

"ఆణత్తం తేణ తుమం
పఇణో పహాఏణ పడహసద్దేణ.
మల్లి ణ లజ్జసి ణచ్చసి
దోహగ్గే పాఅడిజ్జంతే"

(ఆజ్ఞప్తం తేన త్వాం
పత్యా ప్రహతేన పటహశబ్దేన,
మల్లి న లజ్జసే నృత్యసి
దౌర్భాగ్యే ప్రకటీక్రియమాణే.)

గాథాసప్తశతిలో కొంతకు కొంతైనా తెలుగు గడ్డపై వెలసి వుంటుందని పండితులు విశ్వసించడంవల్ల దీనిలోని సామాన్య జీవిత విషయాలు వివరంగా చెప్పవలసి వచ్చింది. దీనిలోని తెలుగు పదాలను గురించి 30 సంవత్సరాల కిందటే భారతిలో వ్రాశాను.[8]

## వజ్జాలగ్గం

వజ్జాలగ్గంకూడ గాథాసప్తశతివలె ముక్తకాల సంకలనమే. దీని సంకలనకర్త జయవల్లభుడనే శ్వేతాంబర జైనముని. ఇతడు 8వ శతాబ్దం ప్రారంభంలో ఉన్నవాడు. తను ధర్మార్థ కామాలనే త్రివర్గం గురించిన సుభాషితాలను సంకలనం చేశానని ఇతడు చెప్పుకొన్నాడు.

"సువ్వన్ను వయణ పంకయ
ణివాసిణిం పణమిఊణ సుయదేవిం,
ధమ్మాఇ తివగ్గజుయం
సుయణాణ సుహాసిఅం వోచ్ఛం." వ-1

(సర్వజ్ఞ వదన పంకజ
నివాపినీం ప్రణమ్య శ్రుతదేవీం,
ధర్మాది త్రివర్గయుతం
సుజనానాం సుభాషితం వక్ష్యామి.)

వివిధ కవుల గాథలలో మేలిమిని గ్రహించి జయవల్లభమనే వజ్జాలగ్గం విధిపూర్వకంగా రచించాను-కూర్చాను-అన్నాడు.[9]

వజ్జా అంటే పద్ధతి; వాటి లగ్గం-సంకలనం, గుచ్ఛం. ఒక ప్రస్తావంలో చెప్పే గాథల పద్ధతిని వజ్జా-వ్రజ్యా అన్నానని తెలుపుకొన్నాడు[10] ఇతడు ప్రాకృతం గురించి గొప్పగా చెప్పుకొన్నాడు. లలిత మధురాక్షరమయినది ప్రాకృత కావ్యం. అది స్త్రీలకు ఇష్టమయింది. శృంగార రసయుతం: అలాటిది వుండగా సంస్కృతం ఎవరు చదువుతారు?-అని ఇతని ప్రశ్న.

"లలిఏ మహురక్ఖరఏ
జువఈ జణ వల హే ససింగారే,
సంతే పాఇఅ కవ్వే
కో సక్కఇ సక్కఅం పడిఉం." -29

గాథలరసం తెలియని మోటువాళ్లు దానిని ఈకకు ఈక, తోకకు తోక లాగి పాడుచేస్తారని, పాలు పితుకడం సరిగా తెలియని వారు, అవులను బాధపెటినట్టు అని, "ఓగాథా, నిన్ను మోటు మనుష్యులు అడ్డదిడ్డంగా చదువుతారు, కర్ణకఠోరంగా, ఎక్కడ బడితే అక్కడ విరుస్తారు, చెరుకుతినడం తెలియని మోటువాళ్లు చెరుకు నమిలినట్టు!" ఇతడు వాపోతాడు.

వజ్జాలగ్గం భర్తృహరి సుభాషిత పద్ధతిలో సంకలనం చేసి నట్టిది. దీనిలో 96 వజ్జాలలో దాదాపు వేయి గాథలున్నాయి. సామాన్యజనుడే ఈ కవి లక్ష్యమూను. కనుక ఇతడు దరిద్రుణ్ణి, ఇతరులను స్వేచ్ఛగా వర్ణించాడు. దరిద్రుడు ఈతని దృష్టిలో సిద్ధు లందరికన్నా మహా సిద్ధుడు.

"దీసంతి జోయసిద్ధా
అంజణ సిద్ధా వి కోవి దీసంతి,
దారిద్దజోయసిద్ధం
మంతే లోయా న పేచ్ఛంతి." 141

(దృశ్యంతే యోగసిద్ధాః
అంజన సిద్ధా అపి కేచన దృశ్యంతే,
దారిద్ర్యయోగ సిద్ధం
మాం తే లోకా న ప్రేక్షంతే.)

దరిద్రుణ్ని ఎవ్వరూ పాటించరు అనటాన్ని కవి ప్రకారాంత రంగా చెప్పాడు. ఒక దరిద్రుడు ఇలా అనుకుంటాడు. యోగసిద్ధులు కనబడుతారు, అంజన సిద్ధులూ కనబడుతారు. నాబోటి దారిద్ర్య యోగసిద్ధులు ఎప్పుడూ, ఎవ్వరికీ కనిపించరు-అని.

ఇతడు రాజసేవకులు, దంభధార్మికులు, వస్త్ర వ్యాపారులు, పల్లెటూరిలో తెలివితేటలవారు, వడ్డెవాళ్లు, వైద్యులు, జ్యోతిష్కులు మొదలయినవారి మన స్తత్త్వాలను బాగా చిత్రించాడు. రాజసేవకు

నికి ఏదైనా సౌఖ్యం కాకతాళీయంగా సంభవిస్తే, అది క్షపణకుని స్వర్గారోహణంవలె, ఎన్నో కష్టాల తర్వాత మరణానంతరం సంభవించవచ్చునంటాడు.

"జఇ నామ కహావి సోక్ఖం
హోఇ తులగ్గేణ సేవఅజణస్స,
తం ఖవణఅ సగ్గారో
హణంవవిగ్గో,వఅ సపహిం." -159

(యది నామ కథమపి సౌఖ్యం
భవతి తులాగ్రేణ సేవకజనస్య,
తత్ క్షపణక స్వర్గారోహణ
మివ (విగోపక శతైః) వ్యాకుల భావశతైః.)

క్షపణకునికి-సన్యాసికి సుఖం కలిగేదెప్పుడు? మరణించిన తర్వాత; అతని గొప్పదనం గ్రహించిన జనం అతనికి విమానంకట్టి మోసుకొనిపోతారు, వాద్యాలు మోగుతుండగా; దానాలు ఇస్తారు. అతని పేర. ఇలా అంత్య సంస్కారం కోసం తీసుకువెళ్లుతారు. ఇలాగే రాజసేవకునికి కాకతాళీయంగా ఏదైనా సుఖం కలిగితే, అది మరణానంతరమే. జీవితకాలంలో సుఖం కలుగదు.

ఒక సేవకుడు ఇలా అనుకుంటాడు..."మంచి పొడుగు గల మూడు ఆవులు, నాలుగు మంచి ఎడ్లు, చేతినిండా వరికంకులు వుంటేచాలు. ఓ సేవాధర్మమా, నీవు ఎక్కడన్నా సుఖంగా వుండు."

"తంబాఉ తిన్ని సుపఓహరాఉ
చత్తారి పక్కల బఇల్లా,
నిప్పన్నా రాలయ మంజరీఉ
సేవా సుహం కుణవు." 160

(గావ స్త్రిస్రః సుపయోధరాః
చత్వారః సమర్థబలీవర్దాః,

